# కాల్గేట్‌తో రోజంతా చెడ్డ శ్వాసను నిరోధించండి దంతక్షయాన్ని నివారించండి!



ఎందుచేతనంటే కాల్గేట్ డెంటల్ క్రీముతో ఒక్కసారి తోమినంతనే 85% వరకు నోటి దుర్వాసనను మరియు దంతక్షయ కారకులైన సూక్ష్మ క్రిములు తొలగిపోవును.









DC.G.38 TEL

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక పురాణచంద్రుడు, గగనచంద్రుడు, గాంధీ ఆల్బం, ఫోటోవ్యాఖ్యాల పోటీ వగైరా.




# విక్స్ వేపొరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది ముక్కుదిబ్బడ పోగొడుతుంది. తేలిగ్గా ఊపిరి తీసుకోనిస్తుంది. పాప హాయిగా, చక్కగా నిద్రపోతుంది.

విక్స్ వేపొరబ్ లో వున్న ఓ గొప్పగుణం: జలుబు బాధలు కలిగే ముక్కు, గొంతు, గుండె, వీపుల మీద రాయచ్చు.

ముక్కుదిబ్బడ ఎంత తొందరగా పోయి, జలుబు బాధ తగ్గి పాప ఎంత హాయిగా వుంటుందో మీ అంతట మీరే చూడగలరు. విక్స్ వేపొరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చడానికి అది రెండు విధాల పనిచేస్తుంది:




బయట-చర్మం మీద




లోపల-ఊపిరి ద్వారా

1. బయట-చర్మం మీద: విక్స్ వేపొరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది, హాయినిస్తుంది.

2. లోపల-ఊపిరి ద్వారా: విక్స్ వేపొరబ్ మందుఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చినప్పుడల్లా ఈ మందుఆవిరి వంట్లో ప్రవేశించి, ముక్కుదిబ్బడను పోగొడుతుంది. గొంతు నొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ జలుబు భారాన్ని మాయంచేస్తుంది.

**ప్రత్యేక గమనిక**



బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద, గొంతు దగ్గర విక్స్ వేపొరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్స్ వేపొరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్స్ వేపొరబ్ వాడండి.




516C A

## విక్స్ వేపొరబ్-జలుబుబాధలకి ఆధునిక ఔషధం

ఏకాంతవాసం కానీయండి, లేదా ఆత్మీయుల సరసన కానీయండి, మీకు ఆనందం కావాలి? పుష్టికరం, సజీవకరం అయిన మాధుర్యమే కోకా కోలా సారాంశం. ఎన్నటికీ సుఖము మొత్తని రుచి. మంచులాంటి చల్లని కోకా-కోలా త్రాగండి.

అడుగడుగున కోకా-కోలా,
ఆనందానికి కోకా-కోలా
కోకా-కోలా, కోకా-కోలా కంపెనీవారి రిజిష్టరు చేయబడిన ట్రేడుమార్కు.

## కోకా-కోలా సాంగత్యం బ్రతుకే ఒక సారస్యం!




CMCC-6-162 TEL



ఈ దీపావళి
మీకు సర్వ శుభములను
కలిగించి, ఆనందదాయకం
కావాలని మనసారా
కోరుచున్నాను.

**సిపాయి చిన్నయ్య**





ఈ క్షణంలో
మీ టూత్ పేస్టు
దంతక్షయాన్ని
నిరోధిస్తున్నదా?

సిగ్నల్ ఒక్కటే
మీ దంతాలను 24 గంటలూ రక్షించే
వెట్టిచారలను కలిగియున్నది






లింటాస్ -SG. 26-504. TL

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి


LIFEBUOY
for health

# సవ్యమైన పెంపకానికి శక్తి
# బోర్న్‌విటా శక్తి !

ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు..వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాలా అవసరం. తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు. రుచికరమై శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారు చేసేవారు — క్యాడ్‌బరిస్






**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం-క్యాడ్‌బరిస్ బోర్న్‌విటా!**





# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ దీపావళికి "చందమామ"ను ప్రత్యేక సంచికగా మీకు అందిస్తున్నాము. "గగన చంద్రుడు" వ్యాసం వెంట ప్రచురించిన కలర్ ఫొటోలు కొడాక్ కంపెనీవారి సౌజన్యంతో ప్రచురించాము.

"చెప్పుల మహిమ" [బేతాళ కథ]కు ఆధారం వి. వెంకటగిరి కథ.

"నావికుడు సింద్‌బాద్" అని 1956లో ప్రచురించిన కథలను కొత్త పాఠకుల కోసం మరొకమారు ప్రచురిస్తున్నాము.

సంపుటి 45 నవంబర్ '69 సంచిక 5





# కృతఘ్నుడు

ఒకనా డొక వేటగాడు అరణ్యంలో వేటాడ దగిన జంతువుల కోసం చూస్తూ పోతూండగా ఒక చోట ఒక గోతిలో నుంచి రకరకాల ధ్వనులు వినిపించాయి. వేటగాడు గోతిలోకి తొంగి చూశాడు.

"బాబూ రక్షించు. నీకు మేలు చేస్తాం!" అని అనేక గొంతులు ఒకేసారి కేకలు పెట్టాయి.

చాలా లోతుగా ఉన్న ఆ గోతి లోపల వేటగాడికి బాగా బక్కచిక్కిన ఒక మనిషీ, ఒక చిరుతపులీ, ఒక పామూ, ఒక ఎలుకా కనిపించాయి.

గొయ్యి నిటారుగా ఉండటంచేత లోపలి ప్రాణులు ఎంత ప్రయత్నించినా పైకి రాలేకుండా ఉన్నాయి.

"మీ కెందుకు సహాయం చెయ్యాలి? ఎలుకలు మా ఆహారాన్ని బతకనివ్వవు. పాములు మమ్మల్ని కరిచి చంపుతాయి. చిరుతపులులు మా దూడలను ఎత్తుకు పోతాయి, మమ్మల్ని భయపెడతాయి. సాటి వాడు గనక మనిషికి సహాయం చేస్తాను," అన్నాడు వేటగాడు.

కాని మిగిలిన జంతువులు తమను కాపాడమని ఎంత దీనంగా వేడుకున్నా యంటే, వేటగాడి మనసు కరిగింది. అతను బలమైన లతలు తెచ్చి, తాడు లాగా మెలి పెట్టి గోతిలోకి దింపి, నాలుగు ప్రాణులనూ పైకి లాగాడు.

"నీకు బహుమతులు తెస్తాం," అని చెప్పి ఎలుకా, పామూ, చిరుతపులీ వెళ్ళి పోయాయి. గోతిలో నుంచి పైకి వచ్చిన మనిషి మాత్రం, "బాబూ, కటిక పేదను. నేను నీ కేమీ ఇవ్వలేను. తిండికే లేని వాణ్ణి," అన్నాడు.

జి. కామేశ్వరరావు



వేటగాడు ఆ మనిషి మీద దయ కలిగి తన కుటీరానికి తీసుకుపోయి, తానే పోషించ నిశ్చయించాడు.

మర్నాడు వేటగాడి కుటీరానికి చిరుత పులి తాను చంపిన జంతువును తెచ్చి ఇచ్చి, "నీకు వేటాడే శ్రమ వద్దు. నేను రోజూ నీ కోసం వేటాడి, మాంసం తెచ్చి ఇస్తాను," అని వెళ్ళిపోయింది.

తరవాత పాము వచ్చి, "నీ కోసం ఒక పొడి తెచ్చాను. దీనిని కృతఘ్నుడి రక్తంలో రంగరించి పాము కరచిన చోట రాస్తే ఎలాటి సర్పవిషమైనా దిగిపోతుంది," అని చెప్పి ఏదో పొడి వేటగాడికి ఇచ్చి వెళ్ళి పోయింది.

తరవాత ఎలుక ఒక మూట ఈడ్చు కుంటూ వచ్చింది.

"ఇందులో నేను చాలా కాలంగా పోగు చేసిన సొమ్ము లున్నాయి. వీటితో సుఖంగా జీవించు," అని చెప్పి ఎలుక వెళ్ళిపోయింది. ఆ మూటలో చాలా విలువైన వెండి, బంగారు నగలున్నాయి.

"వీటితో నేను ధనికుడనయాను. ఈ గుడిసెలో ఉండనవసరం లేదు," అని వేటగాడు మూటలోని నగలు అమ్మేసి, మంచి ఇల్లు కట్టుకుని సుఖంగా జీవించ




సాగాడు. వేటగాడు రక్షించిన మనిషి ఇంకా అతని పోషణలోనే ఉన్నాడు.

అయితే ఆ మనిషి కృతఘ్నుడు. అతనికి వేటగాడి ఐశ్వర్యం చూసి కడుపులో మంట బయలుదేరింది. వేటగాడికి అపకారం చెయ్యటానికి మార్గమేదన్నా దొరుకుతుందా అని ఆ మనిషి చూడసాగాడు.

ఇంతలో దగ్గిరలో ఉన్న నగరాన్ని పాలించే వారి ఇంట దొంగతనం జరిగింది. కొన్ని నగలూ, నగదూ పోయాయి. దొంగను పట్టి ఇచ్చిన వారికి గొప్ప బహుమానం ఇస్తానని నగరపాలకుడు దేశమంతటా చాటింపు వేయించాడు.

వేటగాడి వెంట ఉన్న మనిషి నగర పాలకుడి వద్దకు వెళ్లి, "మీ ఇంట దొంగ తనం చేసిన మనిషి నాకు తెలుసు; మీ నగలు అమ్మి మంచి భవంతి కట్టించు కున్నాడు. కావలిస్తే మీరు వెళ్ళి ఆ ఇంటిని చూడవచ్చు," అన్నాడు.

నగరపాలకుడు తన భటులను పంపి వేటగాణ్ణి పట్టితెప్పించి, "నీకు అంత మంచి ఇల్లు ఎలా వచ్చింది?" అని అడిగాడు.

వేటగాడు తాను నాలుగు ప్రాణాలను గోతిలో నుంచి పైకి తీసినది మొదలు జరిగిన దంతా పూసగుచ్చినట్టు నగర పాలకుడికి చెప్పాడు.

అంతా విని నగరపాలకుడు, "ఎవడు నమ్ముతాడు ఇలాటి తలా తోకా లేని కథలు? నీ మాటలు వింటుంటే నువు దొంగవే అని పిస్తున్నది. ఈ మనిషిని ముందు బంది ఖానాలో ఉంచండి, తరవాత విచారణ జరుపుతాను," అన్నాడు.

ఇదే సమయంలో లోపలి నుంచి నౌకర్లు పరిగెత్తుకుంటూ వచ్చి, పాలకుడి కుమా ర్తెకు పాము కరిచిందనీ, ఆమె స్పృహ తప్పి పడిపోయిందనీ చెప్పారు. పాలకుడు మతిపోయిన వాడిలా అయిపోయాడు.

"విచారించకండి. నా దగ్గిర పాము విషానికి విరుగుడున్నది. నేను గోతి నుంచి రక్షించిన పామే దానిని నా కిచ్చిందని చెప్పానుగద! నా మీద అబద్ధాలు ఆరో పించిన ఈ కృతఘ్నుడి రక్తంలో ఈ పొడిని రంగరించి పాము కరిచిన చోట పూస్తే మీ కుమార్తెకు అపాయం తొలగిపోతుంది," అన్నాడు వేటగాడు.

పాలకుడు అతను చెప్పినట్టే చెయ్య నిచ్చాడు. విరుచుకు పడిపోయిన ఆయన కుమార్తె లేచి కూర్చున్నది. వేటగాడు చెప్పినదంతా నిజమేనని రుజువయింది. పాలకుడు వేటగాడికి క్షమాపణ చెప్పుకుని, కృతఘ్నుడికి ఖైదు శిక్ష విధించాడు.





# ధనదాహం

హారూన్ అల్ రషీద్ బాగ్దాదులో ఖలీఫాగా ఉండగా ఆయన దివాణంలో హసన్ అనే పనివాడుండేవాడు. అతని భార్య ఫాతిమా. ఈ భార్యా భర్తలు ఎలాటి లోభులంటే వాళ్ళు కడుపుకు ఇంత తిండి కూడా తినే వారు కారు. హసన్ తెచ్చుకునే జీతం డబ్బు దాచి, కుక్కలు కూడా తిననంత హీనమైన తిండి తిని బతుకుతూ, నరక కూపం లాంటి ఇరుకు కొంపలో జీవిస్తూ ఆ దంపతులు ఏళ్ళ మీద రెండు సంచుల బంగారం కూడబెట్టారు.

ధనం కూడుతున్న కొద్దీ వారి ధనదాహం కూడా తారస్థాయికి పెరిగింది. తమ తిండికి రాగి డబ్బులు ఖర్చు చెయ్యటానికి కూడా వారికి మనసొప్పటం లేదు. ఒకనాడు హసన్ దివాణానికి వెళ్ళి ఉన్న సమయంలో ఫాతిమాకు ఒక దివ్యమైన ఆలోచన వచ్చింది. ఆమె తాను వాడుకగా వెళ్ళే కిరాణా దుకాణాలకు వెళ్ళి, తన భర్తను అకారణంగా ఖైదు చేశారని దుకాణదార్లతో చెప్పుకుని వలవలా ఏడ్చింది; తాను ఒంటరిదై పోయిందనీ, తన వద్ద రాగి డబ్బు లేదనీ, తన బతుకు బండలయిందనీ వారితో మొర పెట్టుకున్నది.

దుకాణదార్లు ఆమె పైన దయదలచి ఆమెకు కావలిసిన ఆహారం ఉచితంగా ఇచ్చారు. కాని, ధర్మస్వరూపుడని పేరు పొందిన ఖలీఫా హసన్‌కు అంత అన్యాయం ఎలా చేశాడో వారికి అంతుబట్టలేదు. ఆ రాత్రి ఫాతిమా హసన్లకు తమ భోజనం అమృతం లాగున్నది; ఎందుకంటే అది ఉచితంగా లభించింది.

ఇలా కొన్నాళ్ళు దుకాణదార్లు ఫాతిమాకు ఉచితంగా ఆహారం సరఫరా చేసి చివరకు,

ఎస్. భవానీప్రసాద్




"చూడు, ఫాతిమా? ఇలా ఎంతకాలం సాగుతుంది నీకు? అసలు నీ భర్తను ఎందుకు ఖైదు చేశారో వివరాలు చెప్పు. అతని విడుదలకు కృషిచేస్తాం," అన్నారు.

ఫాతిమా కంగారు అభినయించి, "మీ పుణ్యం ఉంటుంది. ఈ మాట ఖలీఫా గారి దాకా పోనివ్వకండి. కొంపలంటుకుంటాయి," అంటూ ఏడ్చింది.

"అలా అయితే మీ బంధువులు కూడా నీకు సహాయపడతారేమో అడిగి చూడు," అన్నారు దుకాణదార్లు.

ఇక దుకాణదార్లు సహాయపడరనీ, వారి దయాధర్మం మీద ఆధారపడటానికి తాను ఇంకా ప్రయత్నిస్తే వాళ్ళకు అనుమానం కూడా కలగవచ్చుననీ ఫాతిమా గ్రహించింది. ఆమెకూ, హసన్‌కూ నగరంలో బంధువులున్నమాట నిజమే. కాని పిసినిగొట్టుతనం కారణంగా వీళ్ళు ఆ బంధువులతో ఏనాడో సంబంధాలు తెంచుకున్నారు.

అయినా ఇప్పుడు ఫాతిమా దురాశ కొద్దీ ఒక్కొక్క బంధువు ఇంటికీ వెళ్ళి, తన భర్తను ఖైదు చేశారన్న కథే చెప్పి రాగాలు పెట్టింది. వాళ్ళందరూ దయదలచి యథాశక్తి ధనమూ, ఆహారమూ ఇచ్చారు. కాస్త ధనవంతులు బాగా ఇస్తే, పేదవాళ్లు కూడా తమకు శక్తి ఉన్నంతలో ఫాతిమాకు సహాయపడ్డారు.

ఇప్పుడు వారి లోభం ఏ స్థాయికి పోయిందంటే, హసన్ బాగా చీకటి ఉండగానే ఇల్లు విడిచి దివాణానికి వెళ్ళాలి; తిరిగి ఊరంతా నిద్రపోయిన దాకా ఇంటికి రావటానికి లేదు; లేకపోతే ఎవరన్నా ఎరిగినవాళ్ళు చూడవచ్చు. అతనిది అజ్ఞాతవాసమై పోయింది.

కొంతకాలమయాక బంధువులు కూడా ఫాతిమాతో, "ఇలా ఎంతకాలం జరుగుతుంది నీకు? మేమంతా సహాయం చేస్తాం. నువు వెళ్ళి ఖలీఫా కాళ్ళపైన పడు. నీ మొగుడు విడుదల అవుతాడు," అన్నారు.

"అమ్మయ్యో, ఇంకేమన్నా ఉందా? ఈ మాట ఖలీఫా వింటే నా మొగుడి పీక తెగిపోదా?" అన్నది ఫాతిమా.

ఇక బంధువుల మీద పడి తినే అవకాశం కూడా పోయింది. ఆ రాత్రి దంపతు లిద్దరూ కూర్చుని ఆలోచించారు. దొంగతనాలు చెయ్యటం ఒక్కటే మిగిలింది.

దివాణంలో కెంపులు కొల్లలుగా ఉండేవి. హసన్ మర్నాడు ఇంటికి వచ్చేటప్పుడు ఒక కెంపును నోట్లో దాచుకుని తెచ్చి తన భార్య కిచ్చాడు. "మనకు ధనికులైన బంధువులు ఉన్నారు. ఈ కెంపు వారిదని చెప్పి, అమ్మి బంగారం తెస్తాను," అన్నది ఫాతిమా.

ఫాతిమా అమ్మజూపిన కెంపు చాలా విలువైనది కావటంచేత వర్తకుడు ఆమెకు డబ్బిచ్చినా, తన మనిషి చేత ఆ కెంపును దివాణానికి పంపి, "ఈ కెంపు తమ జవాహరీలో దేమో చూడండి," అని ఖలీఫాకు కబురు చేశాడు.

వెంటనే దొంగతనం బయటపడి పోయింది. హసన్ ఇంటికి రాజభటులు వచ్చి, ఇల్లు సోదా చేసి, అక్కడ ఉన్న రెండు బంగారంసంచులనూ తీసుకుని, ఫాతిమా హసన్‌లకు బేడీలు తగిలించి తీసుకుపోయి, ఖలీఫా ముందు పెట్టారు.



ఖలీఫా హసన్‌ను చూసి, "దివాణంలో చోరీ చేసినందుకే నీ తల తీయించవచ్చు. కాని నీ భార్య అబద్ధాలాడి దయాపరులైన దుకాణదార్ల వద్దా, బంధువుల వద్దా చాలా ద్రవ్యం కాజేసింది. మీ దగ్గిర ఇంత బంగారం ఉండి కూడా మీరు ఇంతమంది వద్ద దోపిడీలు చేశారు. ఇందుకు మీ ఇద్దరికీ న్యాయంగా మరణదండన విధించాలి. కాని నేను అంత క్రూరమైన శిక్ష విధించను. నేను మీకు విధించే శిక్ష ఏమిటంటే: మీరు ఈ బంగారు సంచులను చెరొకటీ మెడకు కట్టుకుని ఉండాలి. ఏ పరిస్థితిలోనూ వాటిని ఊడదీయరాదు," అన్నాడు.

తమకు శిక్ష చాలా తేలికలో పోయిందని ఆ దంపతులు సంతోషించారు. రాజభటులు రెండు బంగారు సంచులనూ వారి మెడ లకు బంధించి, వారిని ఇంటి దాకా సాగ నంపడానికి వెంట వచ్చారు. కొంత దూరం నడిచాక ఇద్దరికీ సంచుల బరువుతో మెడలు పడిపోయి, బాధ కలగసాగింది.

వారు వెళ్ళాక ఊళ్లో వర్తకు లందరికీ ఖలీఫా ఒక తాఖీదు పంపి, హసన్ ఫాతిమాల బంగారాన్ని ఎవరూ ముట్టరాదనీ, ఆ బంగారం తీసుకుని వారి కేమీ ఇవ్వరాదనీ తెలియజేశాడు. అంతేగాక అస్తమానమూ వారిద్దరి వెంటా నలుగురు విడిస్తే నలుగురు రక్షకభటు లుండేటట్టు కూడా ఖలీఫా ఏర్పాటు చేశాడు.

హసన్ ఫాతిమాలు ఎక్కడికి వెళ్ళినా ఎవరూ వారి బంగారం తీసుకోరు, వారికి ఆహారం అమ్మరు. చివరికి వారు వీధుల్లో పారేసిన ఆహారపు తొక్కలు ఏరుకుని, వీధి కొళాయిలో నీరు తాగి పస్తులుండవలసి వచ్చింది. బంగారం సంచులు మెడకు గుదిబండలయాయి.

ఇలా రెండు రోజులు నరకయాతన అనుభవించి వారిద్దరూ మూడోనాడు వెళ్లి ఖలీఫా కాళ్ళ మీద పడ్డారు. హసన్, "మహా రాజా, ఈ బంగార మంతా మీరే తీసుకుని, తిరిగి నన్ను పనిలో పెట్టుకోండి. మా కిద్ద రికీ తిండీ బట్టా ఇస్తే చాలు. మే మింకేమీ కోరం," అన్నాడు.

"ఒక సంచీ బంగారం దుకాణదార్ల కివ్వండి, రెండోది మిమ్మల్ని ఆదుకున్న బంధువుల కివ్వండి," అన్నాడు ఖలీఫా.

ఆయన వాళ్లిద్దరికీ మంచి ఇల్లూ, బట్టలూ ఏర్పాటు చేసి, హసన్‌ను తిరిగి పనిలోకి తీసుకుంటూ, "పిచ్చివాళ్ళలారా, కొనుగోలు శక్తి తప్ప బంగారానికి మరో విలువ ఏము న్నది? ఇకనైనా మీ రిద్దరూ సుఖంగా బత కటం నేర్చుకోండి," అన్నాడు.






# శిథిలాలయం

## 23

[జాంగ్‌లాను కంచరగాడిచకు కట్టించి, వాణ్ణి ముందుండి దారితీయమని శిఖిముఖి ఆజ్ఞాపించాడు. మధ్యాహ్నంవేళకు అందరూ ఒక నదీతీరం చేరారు. అక్కడ జాంగ్‌లా పైకి ఒక చిరుతపులి దూకింది. పులీ, వాడూ మొసళ్ళున్న నదిలో పడ్డారు. ఆ సమయంలో నది అవతలి నుంచి రివ్వుమంటూ బాణాలు రాసాగినై. తరవాత—]

నది ఆవలి గట్టు నుంచి జాంగ్‌లా, చిరుత పులుల కేసి బాణాలు రావటం చూస్తూనే శిఖిముఖి ఓ క్షణకాలం ఆశ్చర్యపడి, విక్రమకేసరిని హెచ్చరించాడు. ఆ బాణాలు వదులుతున్నవాళ్ళు జాంగ్‌లా మిత్రులని అతడికి అనుమానం కలిగింది. ఆ మిత్రులు మరెవరో కాదు; పూజారిముఠా!

"కేసరీ! మనం నదీతీరం నుంచి కొంచెం వెనక్కు రావటం మంచిది. నది అవతలి నుంచి బాణాలు కొడుతున్నవాళ్ళు పూజారి ముఠా; సందేహం లేదు. మనం వాళ్ళ బాణందెబ్బకు అందుబాటులో వున్నాం, జాగ్రత్త!" అన్నాడు శిఖిముఖి.

శిఖిముఖి హెచ్చరిక వింటూనే కేసరీ, అజితవీరభద్రులు నదీతీరం నుంచి బాగా వెనక్కు వచ్చేశారు. ప్రవాహంలో జాంగ్‌లా, చిరుతపులీ ఒకరి నుంచి ఒకరు వేరుపడిపోయారు. జాంగ్‌లా మునుగుతూ తేలుతూ,







నది అవతలి ఒడ్డుకు చేరేందుకు ప్రయత్నిస్తున్నాడు. చిరుతపులి గిలగిల తన్నుకుంటూ ప్రవాహం వెంట కొట్టుకుపోతున్నది. మొసళ్ళు కొన్ని, బాణాలు తగలటంతో బెదిరిపోయి దూరంగా పోసాగినై.

ఈ స్థితిలో చెట్లచాటు నుంచి ఒక దృఢకాయుడు .తెప్ప నొకదాన్ని ఈడ్చుకుంటూ వచ్చి నదిలోకి వదిలాడు. అతడి వెనకగా పరిగెత్తుకొచ్చిన యిద్దరు వ్యక్తులు ఎగిరి దానిమీద ఎక్క, చిన్నచిన్న తెడ్లతో దాన్ని జాంగ్‌లా కేసి తోసుకుపోసాగారు. తెప్పలాక్కొచ్చిన ధృఢకాయుణ్ణి చూస్తూనే శిఖిముఖి వాడెవడైందీ గుర్తించాడు.

శిఖిముఖి, విక్రమకేసరికి వాణ్ణి చూపిస్తూ, "వాణ్ణి గుర్తించావా? వాడు సవరభేరుండం, పూజారి నౌకరు. గురి చూసి బాణం గుండెల్ని దూసుకుపోయేలా కొట్టు," అన్నాడు.

విక్రమకేసరి బాణం వదిలేందుకు గురి చూసేంతలో, సవరభేరుండం అయిదారడుగుల ఎత్తున్న ఒక డాలును పట్టుకుని, దాని మీంచి తల పైకెత్తి శిఖిముఖి కేసి చూస్తూ, "వాడెవడు, శిఖిముఖా? శబర పెద్ద శివాలుడి కొడుకా? ఎక్కడి కుంభార మిట్టపల్లె, ఎక్కడి బ్రహ్మపుత్రానదీ లోయలు! చావదలిస్తే యింత దూరం రావాలా? వృథా ప్రయాస!" అన్నాడు.

సవరభేరుండం మాట ముగించే లోపలే విక్రమకేసరి వదిలిన బాణం రివ్వుమంటూ పోయి డాలు పైభాగాన్ని తాకి, కింద పడిపోయింది. భేరుండం ఆ దెబ్బకు ఎగిరిపడి, "నా మాటలు వినబడుతున్నయ్యా? ఈ డాలు పూజారి దొర మంత్రించి నా కిచ్చింది. దీని వెనక వున్నవాడికి ప్రాణభయం లేదు!" అన్నాడు.

విక్రమకేసరి విల్లుకు మరో అంబుపెట్టి వదలబోయేంతలో సవరభేరుండం దగ్గిరకు శిథిలాలయ పూజారి వచ్చాడు.





పూజారిని చూస్తూనే శిఖిముఖి చప్పున విక్రమకేసరి కేసి తలతిప్పి, "కేసరీ! ఇప్పుడు నువ్వు కొట్టవలసింది శిథిలాలయ పూజారిని. బాగా గురి చూడు. మేము తక్కినవాళ్ళ సంగతి చూస్తాం," అన్నాడు.

ఆ వెంటనే శిఖిముఖీ, అజితవీరభద్రులు కూడా విల్లంబులు చేతికి తీసుకున్నారు. అందరూ మోకాళ్ళ మీద వంగి బాణాలు వదిలేందుకు గురి చూస్తున్నంతలో పూజారి పెద్దగా నవ్వుతూ కొంచెం వెనక్కుపోయి, "ఒరే, మూఢుల్లారా! మీ బాణాలు యింత దూరం వచ్చి నన్ను తాకలేవు. అయినా ప్రయత్నించండి," అంటూ కేకపెట్టి, తన పక్కనున్న అడవి దొంగలకు సొంజ్ఞచేశాడు.

దొంగలు గబగబా విల్లుకు బాణాలు సంధించి, శిఖిముఖివాళ్ళ కేసి విడవసాగారు. కాని, అవి వాళ్ళవరకూ రాకుండా మధ్య వున్న నదిలో పడిపోసాగినై. శిఖిముఖీ అతడి అనుచరులూ వదిలిన బాణాలు కూడా, పూజారి ముతాను తాకలేదు. ఈ విధంగా నాలుగైదు నిమిషాల పాటు బాణాలు వదిలింతరవాత, యిందువల్ల ప్రయోజనంలేదని పూజారికీ, శిఖిముఖికీ కూడా తెలిసిపోయింది.

శిఖిముఖి తన అనుచరులకు యిక బాణాలు వ్యర్థపరచవద్దని చెప్పి, "మనం వూహించినట్టు శిథిలాలయ పూజారి మనను వెన్నంటే వస్తున్నాడు. మన కన్న ముందుగా వాడు నది దాటాడంటే, బహుశా వాడు యీ సరికే గోల్‌భరా గ్రామం పోయి అక్కడివాళ్ళ నుంచి శిథిలాలయాన్ని గురించి చాలా భోగట్టా సంపాయించి వుంటాడు," అన్నాడు.

"అలా జరిగినట్టే తోస్తున్నది. జాంగ్‌లాను మన మీద తెలివిగా ప్రయోగించి ఆ దుర్మార్గుడు మన రహస్యాలు చాలా గ్రహించాడు," అన్నాడు విక్రమకేసరి.





" ఇప్పటి సమస్య ఎవరు ముందుగా శిథిలాలయాన్ని చేరతారనేదే. గోల్‌భరా గ్రామంలో దాన్ని గురించిన వివరాలు మనం తెలుసుకుందాం అనుకున్నాం. ఒక వేళ పూజారి అక్కడికి ముందుగా పోయినా ముంచుకుపోయింది లేదు. వాళ్లని ఆ శిథిలాలయ ప్రాంతంలోనైనా చేజిక్కించుకుని సర్వనాశనం చేయగలం," అన్నాడు శిఖిముఖి.

నదికి అవతలి నుంచి పూజారి ముఠా, యివతలి నుంచి శిఖిముఖీ అతడి అనుచరులూ ఒకళ్ళనొకళ్ళు కొంతసేపు క్రోధంగా చూసుకుంటూ నిలబడ్డారు. అప్పటి పరిస్థితుల్లో ఎవరికెవరూ హాని కలిగించలేరని రుజువైంది. శిఖిముఖి కొంచెం సేపు ఆలోచించి, విక్రమకేసరితో, " ఇక మనం, ఆ జాంగ్‌లా చెప్పిన కొండచరియ కేసి బయలుదేరదాం. గోల్‌భరా గ్రామం చేరేందుకు అది చుట్టుదారి అయినా తప్పదు. ఈ మొసళ్ళ నదిని శత్రువులు అవతలి గట్టున కాపు వేసుకుని వుండగా దాటాలని ప్రయత్నించటం ప్రమాదానికి దారి తీస్తుంది," అన్నాడు.

శిఖిముఖి యిలా అనగానే అందరూ ప్రయాణసన్నాహాలు ప్రారంభించారు. తమతమ సామానులన్నీ కంచరగాడిదల మీద వేసి, నదీతీరం వెంట నడుస్తూ సూర్యాస్తమయం వేళకు కొండ ప్రాంతాన్ని చేరి అక్కడున్న చిన్న కొండచరియ నొకదాన్ని చూశారు.

నలుమూలలా చీకటి ముసురుకుంటున్న సమయంలో యిరుకుగా వున్న కొండచరియను దాటాలని చూడటం ప్రమాద కారణం అవుతుందని శిఖిముఖీ, విక్రమకేసరీ సంప్రతించుకుని నిర్ణయానికి వచ్చారు. ఆ ఇరుకు దారిలో పూజారి ముఠా ఏ రాళ్ళచాటునో వుండి తమ మీద హఠాత్తుగా దాడి చేయవచ్చు....



రాత్రి రెండు జాములు ముగిసేలోపలే అందరూ భోజనాలు చేశారు. తాము దిగిన చోట నెగడు వేయటంవల్ల, పూజారి మురాకు తమ ఉనికి తెలిసిపోతుందన్న భయంతో శిఖిముఖివాళ్ళు నెగడు వెలిగించ లేదు. కాని, కాపలాకు ఒకరు కాకుండా యిద్దరు చొప్పున వుండటం మంచిదని నిశ్చయించుకున్నారు.

అర్ధరాత్రిపరకూ, ఎక్కడో దూరాన అరణ్యమృగాల అరుపులు తప్ప, వాళ్ళున్న ప్రాంతాన మాత్రం ఎలాంటి సంచలనం కలగలేదు. ఆ తరవాత నదివైపు నుంచి ఏవో ధ్వనులు వినిపించసాగినై. వాటిక్కారణం నదిలోని మొసళ్ళు ఏదో ఆహారం కోసం పోట్లాడుకోవటంగా అజితవీరభద్రులు భావించారు. కాని, ఆ ధ్వనులు వున్నకొందికీ మరింత అధికం కావటంతో వాళ్ళిద్దరూ కత్తులు చేతబట్టుకుని జాగ్రత్తగా నడుస్తూ నదిని సమీపించారు.

నల్లనిచీకటి పరుచుకుపోయిన నదిలో కొన్ని మానవాకారాలు కదులుతూండటం వాళ్ళిద్దరి కంటబడింది. శత్రువులు తెప్పల మీద నదిని దాటుతున్నారన్న సూచనగా వాళ్ళ ఛాయలు అటూయిటూ వూగిసలాడుతున్నవి. అలా జరిగినప్పుడల్లా నీళ్ళు కలి




పినట్టు శబ్దం చేస్తున్నవి. వాళ్ళు అతి జాగ్రత్తగా తెడ్లు వేస్తున్నారన్న మాట!

అజితవీరభద్రులు, శిఖిముఖినీ, విక్రమకేసరినీ హెచ్చరించేందుకు చప్పున వున్న చోటు నుంచి కదిలి వెనక్కు పరిగెత్త బోయారు. అంతలో వాళ్ళమీద చిక్కగా అల్లిన వెడల్పాటి వల ఒకటి విసురుగా వచ్చి పడింది. వాళ్ళు దాన్నుంచి తప్పుకునేందుకు ప్రయత్నించేలోపలే యిద్దరూ అందులో కదిలేందుక్కూడా వీలులేకుండా బిగించబడ్డారు. ఈ రకం వలల్ని ఆటవికులు జింకలనూ, లేళ్ళనూ పట్టేందుకు ఉపయోగిస్తూంటారు.



లాలయ పూజారి ముఠావాళ్ళు కాదన్న మాట! ఇంతకు ముందు తమను హెచ్చరించినవాడన్నట్టు నిజంగా వీళ్ళు యీసరికే శిఖిముఖినీ, విక్రమకేసరినీ కూడా బంధించి వుంటారా ?

వాళ్ళిద్దరి సంశయం తొలగిపోయేట్టు మరుక్షణంలోనే శిఖిముఖివాళ్ళు పడుకున్న గుడారం వైపు నుంచి ఎర్రగండు అరుపూ, మనుషుల కేకలూ వాళ్ళకు వినిపించినై. అక్కడ కొద్ది క్షణాలసేపు గందరగోళం లేచి సద్దు మణిగిపోయింది. అంతవరకూ ఆ దిక్కు కేసి చూస్తున్న ఆటవికుడు తృప్తిగా తలాడించి, తన పక్కన వున్న వాళ్ళతో, "ఈ యిద్దర్నీ అక్కడికి మోసుకురండి!" అంటూ గుడారం వున్న చోటుకు కదిలాడు.

అజితవీరభద్రులున్న వలను యిద్దరిద్దరాటవికులు కర్రకు వేలాడ కట్టుకుని గుడారం దగ్గిరకు వచ్చి దింపారు. శిఖిముఖి చేతులనూ, విక్రమకేసరి చేతులనూ తాళ్ళతో బంధించి యిద్దరాటవికులు పట్టుకుని నిలబడి వున్నారు. ఎర్రగండు వలలో బంధించబడి వున్నది.

"వాళ్ళిద్దర్నీ వలలో నుంచి బయటికి లాగి చేతులకు తాళ్ళు బిగించండి.

అజితవీరభద్రులు వలలో గిలగిల తన్నుకుంటూ, తమ యజమానుల్ని హెచ్చరించేందుకు అరవబోయేంతలో రెండు బలమైన చేతులు వాళ్ళ కంఠాల మీద పడినై. వాళ్ళు ఉక్కిరిబిక్కిరైపోయారు.

"అరిచేందుకు ప్రయత్నించకండి. మీ నాయకులిద్దర్నీ యింతకు ముందే బంధించాం," అన్నదో కంఠం కోపంగా. ఆ మాట్లాడినవాడి దగ్గిరకు మరిద్దరు ఆటవికులు వచ్చారు.

తమను బంధించినవాళ్ళు ఏనుగు చర్మాలు ధరించి వుండటం అజితవీరభద్రులు గుర్తించారు. అంటే వీళ్ళు శిఖి



కుక్కను మాత్రం వలలోనే వుంచి కర్రకు వేలాడకట్టి భుజానవేసుకు రండి. జాగ్రత్త, అది యిప్పటికే మనవాళ్ళిద్దరి గొంతులు కొరికింది,' అన్నాడొక ఆటవికుడు. వాడు వాళ్ళ నాయకుడు.

"ఆ కంచరగాడిదల సంగతేమిటి, దొరా?" అని అడిగా డొక ఆటవికుడు.

"కులపెద్దకు బహూకరిద్దాం. యింత మంచి జాతి కంచరగాడిదలు దొరకవు," అన్నాడు ఆటవిక నాయకుడు.

అంతవరకూ యిదంతా నిశ్శబ్దంగా చూస్తూ వూరుకున్న శిఖిముఖి పెద్దగా గొంతెత్తి అధికారం వుట్టిపడే స్వరంతో, "మీరెవరో మాకు తెలియదు. మేము మా మహారాజును వెతుక్కుంటూ యీ ప్రాంతాలకు వచ్చాం. హఠాత్తుగా దొంగల్లా మా మీదపడి మమ్మల్ని బంధించారు. ఇందుకు మీరు తప్పక ప్రతిఫలం అనుభవిస్తారు," అన్నాడు.

"ఈ బెదిరింపులూ, జడిపింపులూ మా కులపెద్ద వద్ద చేద్దువు గాని. కాళీ మాతకు ప్రసాదం అయ్యే ముందుగా మీ అందరికీ మాట్లాడేందుకు చాలా సమయం, అవకాశం వుంటుంది," అంటూ ఆటవికుల నాయకుడు వికవిక నవ్వాడు.




"మీది గోల్‌భరా గ్రామమా? మీరు ఇభ్యజాతివాళ్ళా? మేం అక్కడికి వచ్చేందుకే బయలుదేరాం. కట్లు విప్పండి. మీ వెంటవస్తాం," అన్నాడు శిఖిముఖి.

"అదృష్టంకొందికీ మీ రెక్కడికి బయలుదేరిందీ మాకు ముందే తెలిసింది. అంతేకాక మీ రెంత ప్రమాదకారులో కూడా విన్నాం. నువ్వన్నట్టు మేం ఇభ్యజాతి వాళ్ళమే. ఇక మాట్లాడకుండా వెంట రండి," అంటూ ఇభ్యుల నాయకుడు తన అనుచరులను హెచ్చరించాడు.

అందరూ నదిని చేరి అక్కడ సిద్ధంగా వున్న తెప్పల మీద ఎక్కి నది దాటి





సూర్యోదయంవేళకు గోల్‌ఖరా గ్రామం చేరారు. గ్రామంలోని ఇభ్యజాతి వాళ్ళంతా—ఆడా మగా పిల్లలూ వీధుల్లో చేరి శిఖిముఖీవాళ్ళను వింతగా చూడ సాగారు. గ్రామం మధ్యనున్న ఒక విశాల మైన చుట్టు గుడిసెను చేరగానే ఇభ్యుల నాయకుడు తన అనుచరులను గుడిసె ద్వారం దగ్గిర ఆగమని చెప్పి, శిఖిముఖీ వాళ్ళతో లోపలికి వెళ్ళాడు.

గుడిసె మధ్య గల ఒక ఎత్తయిన ఆసనం మీద ఇభ్యుల కులపెద్ద కూర్చుని వున్నాడు. అతడు బాగా వృద్ధుడు. వెడల్పాటి ముఖం, పెద్ద కళ్ళూ, పొడవాటి మీసాలూ—అతడు చూడటానికి భయం కొల్పేట్టున్నాడు. అతడి వెనకగా ఇభ్యుజాతి మాంత్రికుడు నిలబడి వున్నాడు. దిగువన ఒక ముక్కాలిపీట మీద తృప్తిగా చిరునవ్వునవ్వుతూ శిథిలాలయ పూజారి కూర్చుని వున్నాడు.

"పూజారి కుక్క యిక్కడున్నదా? ఆశ్చర్యం!" అన్నాడు శిఖిముఖి హేళన చేస్తున్నట్టు.

"మిమ్మల్ని శిథిలేశ్వరికి బలి పెట్టవల సిన పని వుంది గదా? అందుకోసం వచ్చాను," అన్నాడు పూజారి.

"ముందు కాళీమాతకు బలి యిచ్చిం తరవాత, ఆ ఎంగిలి ప్రసాదాన్ని నువ్వే మైనా చేసుకో, తెలిసిందా?" అంటూ ఇభ్యజాతి మాంత్రికుడు కోపంగా పూజారి కేసి కళ్ళురిమాడు.

"శాంతించండి!" అంటూ ఇభ్యుల కులపెద్ద చేయి వూపి, శిఖిముఖీ, విక్రమ కేసరుల కేసి నిశితంగా చూస్తూ, "మీ నలు గుర్నీ బలి చేయాలని నాకు లేదు. మీలో నాయకు డెవరు? వాణ్ణొక్కణ్ణే కాళీమాతకు బలి పెడతాను. తతిమ్మావాళ్ళు స్వేచ్ఛగా తిరిగిపోవచ్చు. నాయకు డెవరో ముందు చెప్పండి?" అన్నాడు. —(ఇంకా వుంది)



# చెప్పుల మహిమ

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీకు ఉన్న ధైర్యసాహసాలలో శతాంశం తనకు ఉన్నట్టయితే రవిపుర యువరాజు కుమారవర్మ తన వివాహం విషయంలో ఒక చర్మకారుడితో పోటీ పడవలసి వచ్చేది కాదుకదా. శ్రమ తెలియకుండా నీకు కుమారవర్మ కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

రవిపుర రాజైన భాస్కరవర్మకు కుమారవర్మ అని ఒక్కడే కొడుకుండేవాడు. అతను చాలా అందగాడు, మంచి మేధావి. యుద్ధ విద్యలన్నీ అభ్యసించినవాడే, కాని పిరికివాడు. ఖేలగానైనా అతను మరొకరితో కత్తి

## బేతాళ కథలు





యుద్ధమో, గదాయుద్ధమో, మల్లయుద్ధమో చెయ్యాలంటే కంపరమెత్తి పోయేవాడు. ఆటల పోటీలలో కూడా అతనికి రక్తదాహం కనిపించేది.

భాస్కరవర్మ వంశం శౌర్యపరాక్రమాలకు ప్రసిద్ధి కెక్కినది. అందుచేత ఆ రాజు తన కొడుకులో పిరికితనం ఉన్నట్టు అనుమానం తగలగానే చాలా బాధపడ్డాడు. అనేక రాజకుమార్తెలకు స్వయంవరాలు జరిగినప్పుడు యుద్ధవిద్యలలో పోటీలు కూడా జరిగేవి. అలాంటి పోటీలలో పాల్గొంటే తన కొడుకు పిరికితనం క్రమంగా పోతుందనుకుని భాస్కరవర్మ ప్రతి స్వయంవరానికీ కుమారవర్మను పంపేవాడు. కాని కుమారవర్మ ఒక్క పోటీలో కూడా పాల్గొనకుండా తిరిగి వచ్చేవాడు. ఇలాంటి పోటీలు చూస్తున్న కొద్దీ కుమారవర్మలో పిరికితనం మరింత హెచ్చిందే గాని ఏమాత్రమూ తగ్గలేదు.

ఇలా ఉండగా భద్రదేశపు రాజు తన కుమార్తె భద్రావతి వివాహానికి చాలా సాహసోపేతమైన పోటీలు ఏర్పాటు చేసి, వాటిలో నెగ్గిన వాడు ఎవడైనా సరే, వాడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళి చేస్తానని దేశదేశాలా చాటింపు వేయించాడు.

భాస్కరవర్మ ఈ స్వయంవరానికి కుమారవర్మను బలాత్కారంగా పంపుతూ, "ఈ సారి నువు భద్రదేశపు రాజకుమార్తెను గెలుచుకోకుండా తిరిగి రావద్దు. పోటీలు చాలా దారుణంగా ఉంటాయి. అయినా సరే, అందులో నువు మరణించినా, నా కొడుకు వీరమరణం చెందాడు గదా అని నేను సంతోషిస్తాను," అని మహా కటువుగా చెప్పాడు.

తండ్రి మాటలకు కుమారవర్మ చాలా నొచ్చుకున్నాడు. తండ్రి తనను, "ఎదిరించిన వారందరినీ చంపు; లేదా, నువే చావు!" అని ఆదేశించినట్టుగా అతనికి

తోచింది. అతను చావటానికే సిద్ధపడి బయలుదేరి భద్రదేశానికి వెళ్ళాడు.

అతను చేరిన మర్నాడే స్వయంవరపు పోటీలు. ఈ పోటీలో పాల్గొనటానికి ఎందరో రాజకుమారులూ, పేరుప్రతిష్ఠలు గల ఇతర కులాల యోధులూ కూడా వచ్చారని అతను తెలుసుకున్నాడు. పోటీలో ఎవరెవరు చావబోతున్నారో కూడా ఊళ్లో ప్రజలు అప్పుడే అంచనా వేసుకుంటున్నారు.

"వీరందరూ రాజకుమార్తెను పెళ్ళాడాలని రావటమేమిటి? ప్రాణాలు బలిపెట్టటమేమిటి? ఇవి చూడగా పోటీలుగా లేవు, యుద్ధాలే!" అనుకున్నాడు కుమారవర్మ.

ఆ సాయంకాలం అతను నదీతీరానికి వెళ్ళి కూర్చుని ఒక నిశ్చయానికి వచ్చాడు. తనకా రాజకుమార్తెను పెళ్ళాడాలన్న తహతహ ఏమీ లేదు. పోటీలో పాల్గొంటే, తన కన్న అర్భకులు కొందరు తన చేత చచ్చినా, మరొకరి చేతిలో తనకు చావు నిశ్చయం. తన ప్రాణం తానే తీసుకుంటే తన కెక్కువ ఆత్మశాంతి ఉంటుంది.

ఇలా అనుకుని అతను సుడులు తిరుగుతూ ప్రవహించే నదిలోకి దూకేశాడు.

ప్రవాహం దిగువను ఒక చర్మకారుడు, నదిలో కొట్టుకు వచ్చే కుమారవర్మను




చూసి, ఈదుకుంటూ వచ్చి అతన్ని పట్టుకుని ఒడ్డుకు లాగాడు.

"చూడబోతే గొప్ప కుటుంబంవాడివి లాగున్నావు. నదిలో ఎలా పడ్డావు, బాబూ?" అని చర్మకారుడు కుమారవర్మను అడిగాడు.

"ప్రమాదవశాన పడలేదు, బుద్ధిపూర్వకంగానే పడ్డాను. నాకు జీవితం మీద విరక్తి కలిగింది. నన్ను నీటిలో నుంచి ఎందుకు లాగావు? మెచ్చి నీకు నే నేదన్నా బహుమానం ఇస్తాననుకున్నావు కాబోలు. నేను నీ కేమీ ఇవ్వను," అన్నాడు కుమారవర్మ.

చర్మకారుడు మంచి మాటలతో కుమారవర్మ కథ అంతా మెల్లిగా బయటికి లాగి,



"ఈ మాత్రానికే కోరి చావు తెచ్చుకోవాలా? నువు వట్టి పిరికివాడివి. నా దగ్గిర మహిమ గల చెప్పు లున్నాయి. అవి తొడుక్కుని స్వయంవరానికి వెళ్ళావంటే నీకు వెయ్యి ఏనుగుల బలమూ, వెయ్యిసింహాల ధైర్యమూ వస్తుంది. అందరూ నీ చేతిలో చిత్తుగా ఓడిపోతారు. అసలు నిన్ను చూడ గానే వాళ్ళ గుండె జారిపోతుంది. చూడూ, నీ నుంచి నేను బహుమానం ఆశించిన మాట నిజమే. ఒప్పుకుంటాను. కాని నాకా బహుమానం ఇప్పు డివ్వకు. రేపు సాయం కాలం రాజకుమార్తెను గెలుచుకున్నాక ఇయ్యి," అన్నాడు.

"నీ కేం కావాలి?" అని కుమారవర్మ అనుమానంగా అడిగాడు.

"నేను ఏదడిగితే అది ఇయ్యి. నీది కాని దేదీ అడగనులే," అన్నాడు చర్మ కారుడు. వాడు తన తోలుసంచీ నుంచి ఒక చెప్పుల జత తీసి కుమారవర్మకు ఇచ్చి, మర్నాడు సాయంకాలం పోటీలు జరిగే చోటికి వస్తానని చెప్పి, వెళ్ళిపోయాడు.

చర్మకారు డిచ్చిన చెప్పులు తొడుగు కుంటూండగానే కుమారవర్మకు ఒక మాట జ్ఞాపకం వచ్చింది. దైవయోగం వల్లనే తాను బతికాడు. తాను నదిలో పడి చచ్చిపోతే తన తండ్రికి తీరని అవమానం కలిగేది. ఆయన తనను ఏం కోరాడు? భద్రావతిని పెళ్ళాడటమో, వీరమరణం పొందటమో చెయ్యమన్నాడు. చావ దలుచుకున్న తర వాత పోటీలోనే చచ్చిపోయి, తండ్రికి తృప్తి కలిగించడం మంచిది గద! ఇతరులను చంపకుండా ఉండాలనే కదా తాను పోటీలో పాల్గొనరా దనుకున్నది? ఆ చచ్చేవాళ్ళు తన చేతిలో కాకపోతే ఇతరుల చేతిలో నైనా చస్తారు.

ఇలా ఆలోచించుకుంటే తాను పోటీలో పాల్గొనకపోవటం బొత్తిగా అర్థంలేని పని అనిపించింది.






మర్నాడు కుమారవర్మ గుండె రాయి చేసుకుని పోటీ యుద్ధాలలో పాల్గొనటానికి వెళ్ళాడు. ప్రాణం మీద ఆశ వదులుకున్నాడేమో అతను తన ప్రత్యర్థులతో మహా రౌద్రంగా పోరాడాడు. ఒక్కొక్కరే అతని చేతిలో ఓడుతూ వచ్చారు. గెలుస్తున్నకొద్దీ అతనిలో తెగువమారితనం విజృంభించింది. నిజానికి అతను యుద్ధవిద్యలు ఎరగనివాడు కాడు; మిగిలినవాళ్ళు అతని కన్న ఆ విద్యలు హెచ్చుగా తెలిసినవారూ కాదు. కాకపోతే వారందరూ రాజకుమార్తెను భార్యగా పొందే ఆలోచనలతో మెదడు మెత్తనై పోయినవారు. కుమారవర్మలో ఆ దౌర్బల్యం లేదు.

సూర్యాస్తమయం అయేలోపుగా అతను అందరినీ జయించాడు.

వరమాలతో వచ్చిన భద్రావతికి అతని అందమైన విగ్రహం కంట పడేసరికి కళ్ళు జిగేలుమన్నాయి.

సరిగా ఆమె అతని మెళ్ళో మాల వేసే సమయంలో జనంలో నుంచి చర్మకారుడు కుమారవర్మను సమీపించి, "రాజకుమార్తె చేత మాల వేయించుకునే ముందు నా బహుమానం నాకు దయచేయించండి," అన్నాడు.

కుమారవర్మ కృతజ్ఞతతో, "తప్పకుండా ఇస్తాను. నీకేం కావాలి?" అని అడిగాడు.

"ఆ మాల నా మెడలో వెయ్యమని రాజకుమార్తెతో చెప్పండి. ఆమెను మీరు గెలుచుకున్నారు. ఆమె ఇప్పుడు మీ సొత్తు," అన్నాడు చర్మకారుడు.

ఈ మాట వినగానే కుమారవర్మ కొయ్యబారి పోయాడు. రాజకుమార్తె ముఖం పాలి పోయింది. దగ్గరలో ఉన్నవాళ్ళు చర్మకారుణ్ణి చంపబోయారు. కుమారవర్మ వాణ్ణి కాపాడవలిసి వచ్చింది.

భద్రావతి తండ్రి ముందుకు వచ్చి సంగతేమిటని విచారించాడు. కుమారవర్మ

బిడియ పడకుండా, తాను నదిలోకి దూక టమూ, చర్మకారుడు తనను బయటికి లాగటమూ, వాడు తనకు మహిమ గల చెప్పు లివ్వటమూ, వాటి సహాయంతోనే పోటీలో తానునెగ్గటమూ, రాజుకు చెప్పాడు.

అంతా విని రాజు బిగ్గరగా నవ్వి, చర్మ కారుడితో, "ఒరే, నువ్విక్కడ ఒక్క క్షణం నిలిచావంటే నిన్ను కండకు కండ కోసి, కాకులకూ గద్దలకూ వేయిస్తాను," అన్నాడు.

"నా చెప్పులు నాకు దయ చేయించండి," అని చర్మకారుడు కుమారవర్మ కాళ్ళకున్న చెప్పులు తీసుకుని, జనంలో దూరి కనబడకుండా పోయాడు.

తరవాత భద్రావతికీ, కుమారవర్మకూ వైభవంగా వివాహం జరిగింది. కొడుకు తన మాట నిలబెట్టినందుకు భాస్కరవర్మ పరమానంద భరితుడయాడు.

బేతాళు డీ కథ చెప్పి. "రాజా, భద్రపురం రాజు చర్మకారుడి పట్ల అంత అన్యాయంగా ఎందుకు ప్రవర్తించాడు? వాడి చెప్పులు ధరించే కదా కుమారవర్మ విజయం సాధించినది? చర్మకారుడు ఈ అన్యాయాన్ని సహించి ఎందుకు వెళ్ళిపోయాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "చెప్పులలో మహిమ ఏమీ లేదు. వాటిలో మహిమే ఉంటే చర్మకారుడు వాటిని ధరించి పోటీలో పాల్గొని ఉండవచ్చు. భద్రదేశపురాజు అభ్యంతరం చెప్పి ఉండేవాడు కాడు. కుమారవర్మ విజయానికి కారణం పోటీకి వచ్చినప్పుడు అతని మనస్థితే. అదే అతనికి పోటీలలో విజయం సాధించి పెట్టింది," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# అన్నలూ-తమ్ముడూ

## 2

మిత్రుడికి స్పృహ వచ్చి చూసేసరికి చుట్టూ నీరు కనిపించింది. అతను కల్యాణిని నిద్ర లేపేసరికి ఆమె పరిస్థితి చూసి, భయపడి ఏడవసాగింది.

"ఏడవకు. ఇంకా నయం, మనం మునిగిపోలేదు," అన్నాడు మిత్రుడు.

త్వరలోనే వాళ్ళున్న కొయ్యపలక ఒక ఒడ్డుకు వచ్చింది. ఇద్దరూ ఒడ్డెక్కారు. వాళ్ళు అక్కడ ఉన్న చెట్ల మధ్యగా వెళ్ళి ఒక గుడిసెను చేరుకున్నారు. ఇద్దరికీ ఆకలిగా ఉన్నది. అక్కడ ఏమైనా తినటానికి దొరుకుతుందేమో ననుకుని ఆ గుడిసెలోకి వెళ్ళారు.

లోపల చీకటి చీకటిగా ఉన్నది. గుడిసె మధ్య ఒక ముక్కాలిపీట మీద ఒక వింత ముసలిది కూర్చుని ఉన్నది.

"అవ్వా, తినటాని కేమన్నా ఉన్నదా?" అన్నాడు మిత్రుడు.

"నే నీ పీట వదిలి లేవలేను. ఆ మూల గిన్నెల్లో ఆహారం ఉంది. మీరే తీసుకోండి," అన్నది ముసలిది వణుకుతున్న గొంతుతో.

వాళ్ళిద్దరూ ఆ మూలకు పోతూండగా కప్పు నుంచి ఒక బ్రహ్మాండమైన కత్తి పెద్ద చప్పుడుతో వారి వెనక పడింది.

"అదృష్టవంతులు. ఆ కత్తి మీ మీద పడితే చచ్చి ఉందురు," అన్నది ముసలిది.

"అలాటి కత్తిని ఎందుకు వేళ్ళాడగట్టావు?" అని మిత్రుడు అడిగాడు.

"అది నేను వేళ్ళాడగట్టలేదు. నే నీ పీటకు ఇలా అతుక్కుపోయి ఉన్నాను. ఎవరు వచ్చి నన్ను విడుదల చేస్తారా అని చూస్తున్నాను," అన్నది ముసలిది.

సి. హనుమంతరావు





"అదేం పని? నేను చెయ్యను," అన్నాడు మిత్రుడు.

"నా కోసమైనా చెయ్యాలి, బాబూ. ఎవరైనా నా తల నరికితేనే గాని నా కీ ముక్కాలి పీట నుంచి విముక్తి లేదు; అప్పుడు గాని ఇక్కడ అదృశ్యంగా ఉన్న మహానగరం కనబడదు. నా తల నరికే బలమే నీకు ఉండాలి గాని నువు ఆ మహానగరానికి రాజైపోతావు!" అన్నది ముసలిది.

"కల్యాణి సహాయంతో నేను నీ తల నరకగల నవ్వా," అన్నాడు మిత్రుడు.

మిత్రుడు ఎంతో చెప్పిన మీదట గాని కల్యాణి ముసలిదాని తల నరకటానికి ఒప్పుకోలేదు. చివరకు ఇద్దరూ తమ బలమంతా ఉపయోగించి కత్తి నెత్తారు. మిత్రుడు కత్తిని ముసలిదాని మెడ మీదికి విసిరేటప్పుడు కల్యాణి గట్టిగా కళ్ళు మూసుకున్నది. మరు క్షణంలో ముసలిదాని తల తెగి కింద పడింది.

అంతలోనే చుట్టూరా కోలాహలం వినిపించింది. "రాజుగారికీ జై!" అని జనం గోలగా అరుస్తున్నారు.

పిల్లలిద్దరూ వింతగా చూశారు. వాళ్ళున్న గుడిసె అదృశ్యమై పోయింది. చుట్టూ ఎత్తయిన మేడలూ, విశాలమైన వీధులూ,

మిత్రుడూ, కల్యాణీ కలిసి గిన్నెల్లో ఉన్నదంతా తినేశారు.

"అయ్యో, అవ్వా! నీ కేమీ మిగల్బకుండా అంతా మేమే తినేశాం," అన్నాడు మిత్రుడు.

"తింటే తిన్నారు. నా విచారమల్లా మీరు నన్ను విడుదల చెయ్యలేరే అని. మీరు మరీ పిల్లలు కాకుండా కాస్త పెద్దవాళ్లయితే బాగుండేది," అన్నది ముసలిది.

"నేను బలం గలవాణ్ణే!" అన్నాడు మిత్రుడు ధైర్యంగా.

"ఆ కత్తితో నా తల నరికేపాటి బలం ఉన్నదా?" అన్నది ముసలిది.

వాటిలో వేగంగా పోతూ రథాలూ, బళ్ళూ కనిపించాయి. అసంఖ్యాకులుగా జనం కనిపించారు. సంగీతమూ, వాద్యాలూ విన పడుతున్నాయి.

జనం మిత్రుణ్ణీ, కల్యాణినీ తమ భుజాల మీద ఎత్తుకుని రాజభవనానికి వెళ్ళారు. "మమ్మల్ని శాపం నుంచి విడిపించారు. మీరే మాకు ఏలికలు," అన్నారు వాళ్ళు.

వాళ్ళిద్దరికీ మహా వైభవంగా పట్టాభిషేకం జరిగింది. వాళ్ళు ఇంకా పసివాళ్ళే అయినా, ఎంతో సమర్థతతో రాజ్యపాలన చేశారు.

మరో అయిదేళ్ళు గడిచాయి. ఇద్దరూ ఇప్పుడు పదిహేడేళ్ళవాళ్ళు. ఇక తాము వివాహం చేసుకుందామని వాళ్ళు అనుకున్నారు. ఈ మాటకు ప్రజలు ఎంతో హర్షించారు.

పెళ్ళి ఇంకా కొద్దిరోజు లున్నదనగా కల్యాణి మిత్రుడితో, "మన పెళ్ళికి మా అమ్మనూ, నాన్ననూ, నా అక్కలనూ పిలుద్దామని ఉన్నది. వాళ్ళకు కాస్త కబురు పంపించు," అన్నది.

"వాళ్ళతో బాటు నా అన్నలు కూడా వస్తారు. వాళ్ళు నన్ను చంపాలని చూశారు, నీకు తెలుసుగదా? మనని మీ తండ్రి ఏట్లో వదిలెయ్యటానికి కూడా వాళ్ళే కారణం," అన్నాడు మిత్రుడు.





"తమరు మా నగరాన్ని గురించి వినే అవకాశం లేదు. శాపవశాన మా నగరం అయిదేళ్ళ క్రితం వరకూ భూగర్భంలో ఉండిపోయింది. నూరేళ్ళపాటు ఆ నగరాన్ని చూసినవారు లేరు," అన్నారు మిత్రుడి దూతలు.

"అయితే అలాంటి నగరాన్ని తప్పక చూడవలసిందే!" అంటూ కల్యాణి తండ్రి తన వారందరినీ ప్రయాణానికి సిద్ధం చేయించాడు.

తాను పంపిన దూతల వెంట వచ్చిన కల్యాణి తండ్రినీ, అయన ముగ్గురు కుమార్తెలనూ, వారి పిల్లలనూ, వారి భర్తలైన తన అన్నలనూ మిత్రుడు స్వయంగా ఎదురు వచ్చి ఆహ్వానించాడు.

వారిలో ఒక్కరు కూడా మిత్రుణ్ణి గుర్తించలేదు. గడచిన అయిదేళ్ళలోనూ అతను చాలా ఎదిగి, ఇప్పుడు తన పెద్ద అన్న కంటె కూడా గుప్పెడున్నాడు. ముసలిదాని తల నరికిన కత్తిని అతనిప్పుడు తేలికగా ఎత్తటమే గాక, పట్టుకు తిరుగుతున్నాడు. అది అస్తమానమూ అతని రొండిన ఉంటున్నది.

కల్యాణి కూడా గుర్తుపట్టరాకుండా మారిపోయింది. ఆమె తన అక్కల కన్న కూడా

కాని కల్యాణి అదే పనిగా బతిమాలిన కారణంచేత అతను ఆమె కోరికను ఆమోదించాడు.

వార్తావహులు కల్యాణి తండ్రి వద్దకు వెళ్ళి, "మా రాజుగారు తమ వివాహానికి మిమ్మల్ని కుటుంబ పరివార సమేతంగా దయచెయ్య వలసినదిగా కోరుతూ మమ్మల్ని పంపారు," అని చెప్పారు.

"ఇంత కాలంగా రాజ్యమేలుతున్నాను గాని మీ రాజ్యం పేరే వినలేదు. మీ రాజధాని ఎక్కడ ఉన్నది?" అని కల్యాణి తండ్రి వారిని అడిగాడు. పెళ్ళి కానున్నది తన కుమార్తెకే నని ఆయనకు తెలియదు.

మంచి సౌందర్యవతిగా తయారయింది. వాళ్ళ సౌందర్యం కొంతవరకు వాడి పోయింది. వాళ్ళ పిల్లలు మాత్రం పళ్ళల్లే చాలా చక్కగా ఉన్నారు. ఆమెను కూడా ఎవరూ గుర్తించలేదు. అమాంతం తన తల్లినీ, అక్కలనూ కావిలించుకోవా లన్న ఉద్రేకాన్ని కల్యాణి అతి కష్టంమీద నిగ్ర హించుకున్నది.

వివాహ సందర్భంలో జరిగిన విందులో మిత్రుడు మామగారిని తన పక్కనే కూర్చో బెట్టుకుని, "తమరిని సకుటుంబంగా రమ్మని ఆహ్వానించాను. తమవారంతా ఇక్కడ ఉన్నట్టేనా?" అని అడిగాడు.

రాజు ఒక్కసారి అందరినీ కలయజూసి, "ఆ! అందరమూ వచ్చాం," అన్నాడు.

"తమకు నలుగురు కుమార్తెలని విన్నానే?" అన్నాడు మిత్రుడు.

"నలుగురుండేవారు. కాని నా ఆఖరు కుమార్తె అయిదేళ్ళ క్రితం చనిపోయింది," అన్నాడు రాజు.

"ఎలా పోయిందో?" అన్నది కల్యాణి.

"నీటిలో మునిగి," అన్నాడు రాజు.

"ఆమెకు రక్షకులను పెట్టలేదు కాబోలు," అన్నది కల్యాణి.

"అదొక దుస్సంఘటన. దాన్నిగురించి మాట్లాడటం నాకిష్టంలేదు," అన్నాడు రాజు.







నీటిలోకి దొర్లి, ఎక్కడో మునిగిపోయి ఉండాలి," అన్నాడు.

కల్యాణి ఉద్రేకం ఆపుకోలేక బయట పడబోయింది. కాని మిత్రుడు ఆమె చెయ్యి గట్టిగా నొక్కి వారిస్తూ, "మీరు చేసిన పాడు పనికి పశ్చాత్తాప పడటం సరి అయినదే. ఎందుకంటే, ఆ పిల్లలు చేసిన ద్రోహం ఏమీ లేదు. ఎవరో వాళ్ళకు మత్తుమందు ఇవ్వటంచేత వాళ్ళు నిద్రపోయి ఉంటారు," అన్నాడు రాజుతో.

రాజు ఆశ్చర్యపడి, "ఇదంతా మీ కెలా తెలుస్తుంది?" అన్నాడు.

"ఎలా తెలుస్తుందంటే, మీరు నీటిలో ముంచమని ఉత్తరు విచ్చిన చెంచు కుర్రాణ్ణి నేనే గనక!" అన్నాడు మిత్రుడు.

"నేనే నీ కూతుర్ని. నన్ను గుర్తుపట్ట లేదా?" అంటూ కల్యాణి చప్పున లేచి నిలబడింది.

అదే క్షణంలో మిత్రుడి అన్నలు కత్తులు దూసి లేచారు.

"శుద్ధ అబద్ధం! మా తమ్ముడు ఏనాడో చచ్చాడు," అన్నారు వాళ్ళు.

"లేదు, నేను బతికే ఉన్నాను. నన్ను చంపాలని సింహాలకు వేశారు, ఇంకేవేవో చేశారు. కాని నేను చావలేదు. అది అలా

"దయచేసి, ఆ దుస్సంఘటన ఏమిటో చెబుదురూ!" అని కల్యాణి ప్రాధేయ పడింది.

రాజు కథ యావత్తూ చెప్పి పెద్ద విచారంలో ఉన్నట్టు కనబడ్డాడు.

"ఆ పిల్లలను నీటిలో ముంచి చంపినందుకు తరవాతనైనా పశ్చాత్తాప పడ్డారా?" అని మిత్రుడు రాజు నడిగాడు.

రాజు తల ఆడించి, "మర్నాడే ఎంతో విచారించాను. నది వెంబడి ఒక పడవను పంపి, పిల్లలు దొరికితే ఇంటికి తెమ్మన్నాను. కాని నా భటులకు పిల్లలు పడుకున్న కొయ్యపలక మాత్రమే దొరికింది. వాళ్ళు



ఉంచి, నేను మీ తమ్ముణ్ణని నా నోటితో చెప్పలేదు. మీరు చెంచు లన్న సంగతి ఎందుకిలా బయట పెట్టుకున్నారు? అది దాచటానికే గదా నన్ను మీరు చంప యత్నించింది?" అన్నాడు.

ఈ మాటలను వింటూనే రాజుగారి పెద్ద కుమార్తెలు ముగ్గురూ చప్పున లేచి నిలబడ్డారు; "ఏమిటీ? మీరంతా చెంచులా? నిజమేనా?" అన్నారు.

"శుద్ధ అబద్ధం!" అంటూ అన్నలు కత్తులతో మిత్రుడి పైకి వెళ్ళారు.

మిత్రుడు తన భారీ ఖడ్గాన్ని ఒక్కసారి విసిరి, వాళ్ళ చేతుల్లోని మూడు కత్తులూ అంత దూరాన పడేటట్టు కొట్టాడు.

"మీరింకేం నిజాన్ని కప్పి పెట్టగలరు? నన్ను చంపటం కూడా ఇక మీతరం కాదు. నేనిప్పుడు వెనకటి అర్భకుణ్ణి కాను. జరిగిన దానికి మన్నించమని మీరు మీ భార్యల కాళ్ళ మీద పడండి. పాపం, వాళ్ళని చాలా కాలం మోసగించారు," అన్నాడు మిత్రుడు.

అన్నలు తలలు వంచుకున్నారు.

కల్యాణి అక్కలు తమలోతాము కూడ బలుక్కుని, "ఇన్నేళ్ళు వాళ్ళతో కాపరం చేసి, పిల్లల్ని కూడా కన్నాం. వాళ్ళను క్షమించటమే మంచిది," అనే నిశ్చయానికి వచ్చారు. కాని వాళ్ళు తమ భర్తలను ఒకందుకు క్షమించలేక పోయారు. వాళ్ళు తమ బుల్లి చెల్లెలు హత్యకు పూనుకున్నారు; తమ సొంత తమ్ముణ్ణి చంపాలని చూశారు. అవి క్షమించరాని నేరాలు.

"నేనూ, కల్యాణీ కూడా వాళ్ళను క్షమిస్తున్నాం. మీరెందుకు క్షమించరాదు?" అన్నాడు మిత్రుడు తన వదినెగార్లతో.

మిత్రుడి అన్నలు ముగ్గురూ తమ భార్యలను క్షమాపణ వేడుకున్నారు. ఎలాటి అరమరలూ లేకుండా మిత్రుడి వివాహ మహోత్సవం సలక్షణంగా జరిగిపోయింది. అంతా సుఖంగా ఉన్నారు.



# ఘనవిజయం

శివకోట మహారాజుకు ఊరికే ఉండటం విసుగెత్తి తన రాజ్యానికి పడమరగా ఉన్న చిన్న కోట మీదికి సైన్యాలు తీసుకుని యుద్ధానికి వెళ్ళాడు. ఇదే సమయంలో శివకోట రాజ్యానికి తూర్పుగా ఉన్న పెదకోట రాజు శివకోట మీదికి దండెత్తి వచ్చాడు.

పెదకోట రాజు సైన్యంతో వస్తున్నాడని తెలియగానే శివకోటలో ఆందోళన బయలు దేరింది. శివకోటను రక్షించటానికి సైన్యం లేదు. ఒకప్పుడు శివకోట సేనానిగా పనిచేసి వృద్ధుడై పోయిన రణమల్లుడూ, అతనిలాగే మంచి పరాక్రమవంతులని ఒకప్పుడు పేరు పొంది వృద్ధాప్యం వచ్చేసిన ఇద్దరు ముగ్గురు యోధులూ మాత్రం ఉన్నారు.

రణమల్లుడు దీర్ఘంగా యోచించుకుని ఒక ఉపాయం ఆలోచించాడు. "కోటతలుపు తెరవండి. ముఖద్వారానికి తోరణాలు అలంకరించండి. అక్కడ బాజాభజంత్రీలను ఏర్పాటు చెయ్యండి," అని ఉత్తరువిచ్చి, తాను మంచి దుస్తులు ధరించి, శాలువ కప్పుకుని నిలబడ్డాడు రణమల్లుడు. ఆయన పక్కనే ముసలి యోధులు నిలబడ్డారు.

శత్రుసేనలు కనుచూపు మేరలోకి రాగానే రణమల్లుడు, "పెదకోట మహారాజావారికి జయం! జయం! స్వాగతం! స్వాగతం!" అని అరిచాడు. ఆయనతో పాటు మిగిలిన వాళ్ళూ అరిచారు.

పెదకోట మహారాజు తన రథాన్ని ఆపించాడు. ఆయన వెనక ఆయన సేనలూ నిలిచిపోయాయి. "జిత్తులమారి ముండాకొడకా! నీ సంగతి నాకు తెలీదా? కోటలోకి ఆహ్వానించి, లోపల దాచి ఉంచిన నీ సేనకు మమ్మల్ని బలిచేద్దామనుకున్నావా? నీ ఎత్తులు మన దగ్గిర పారవు," అంటూ పెదకోట రాజు తన సేనను వెనక్కు తిప్పుకుని వెళ్లిపోయాడు.





# అనుభవంలేని నిపుణురాలు

ఒక రాజుకు చదరంగ మంటే చాలా ప్రీతి. ఆయన తన ఆస్థానంలో మేటి చదరంగపు ఆటగాళ్ళను కొలువుంచుకుని, తాను కూడా గొప్ప ఆటగాడే గనక, వారితో చదరంగం ఆడుతూ ఆనందించేవాడు.

ఇలా ఉండగా ఒకనాడు ఆయన ఆస్థానానికి ఇద్దరు చదరంగపు ఆటగాళ్లు వచ్చి, "మహారాజా, మేము చదరంగంలో ఎన్నడూ ఓటమి అనేది ఎరగం. మీ ఆస్థానంలో మేటి ఆటగాళ్లున్నారని తెలిసి వారిని కూడా ఓడించాలని వచ్చాం," అన్నారు.

రాజు ఆ ఆగంతకులతో తానూ, తన వద్ద ఉన్న ఆటగాళ్ళూ చదరంగం ఆడటానికి తగు ఏర్పాట్లు చేశాడు.

కొత్తగా వచ్చిన వాళ్ళిద్దరూ, ఒకరి తరవాత ఒకరుగా, ప్రత్యర్థులందరితోనూ ఒకే సారి ఆడి, అందరి ఆటలూ ఒకటొకటే కట్టించారు. రాజు వారిద్దరితో సమానమైన ఆటగాళ్లు తన ఆస్థానంలో లేరని గ్రహించాడు.

కొత్త ఆటగాళ్ళు విజయగర్వంతో సభ వారిని చూసి, "ఈ సభలో ఇంకెవరన్నా చదరంగనిపుణు లుంటే మాతో ఆడి మమ్మల్ని ఓడించి, మా బిరుదులు పుచ్చుకోవచ్చు," అన్నారు.

అప్పుడు ప్రేక్షకుల వెనక నుంచి ఒక తొమ్మిదేళ్ళ పిల్ల ముందుకు వచ్చి, "మహారాజా, వీరిద్దరితోనూ ఒకేసారి చదరంగం ఆడటానికి నాకు అనుమతి ఇప్పించండి," అని అన్నది.

"మేటి ఆటగాళ్ళను ఓడించిన నిపుణులతో ఈ పిల్ల చదరంగం ఏమి ఆడుతుంది? ఈ పిల్లను ఆడనిస్తే నేను అపహాస్యం పాలవుతానేమో?" అని రాజు సంకోచించాడు.

యస్. జహర



కాని కొత్త ఆటగాళ్ళు మాత్రం ఆమె వయసు పాటించకుండా, "రా, అమ్మా. చాతనయితే మమ్మల్ని ఓడించు," అన్నారు.

అప్పుడా పిల్ల వారిద్దరినీ రెండు గదులలో కూర్చోబెట్టి, వారి ముందు చదరంగం బల్లలు పెట్టి, పావులు అమర్చి, ఒకరి వద్ద ఎత్తు వేసి, మరొకరి వద్దకు వెళ్ళి ఎత్తు వేస్తూ చదరంగం ఆడసాగింది.

ఆషామాషీగా ఆడదా మనుకున్న ఆ నిపుణులు, ఈ పిల్ల ఉద్దండురాలని మొదటి మూడు ఎత్తులలోనే గ్రహించారు. వారి ముఖాలు గంభీరంగా మారాయి. మరి కాస్సేపటికి ఇద్దరి ముఖాలా చెమటలు పట్టాయి. ఆట పూర్తికాక మునుపే ఇద్దరూ ఆట మానేసి, "ఈ పిల్లను ఓడించటం మా తరం కాదు!" అని ఒప్పుకున్నారు.

రాజు ఆశ్చర్యానికి అంతులేదు. ఆ పిల్ల తండ్రి ప్రేక్షకులలోనే ఉన్నాడు: రాజు ఆయనను పిలిచి, "ఇంత చిన్న పిల్ల చదరంగంలో ఇంత ఘటికురాలైతే నా కెందుకు చెప్పలేదు?" అన్నాడు.

"నా కూ్కడా ఏమీ అర్థం కాకుండా ఉన్నది, మహారాజా! ఇది రెండురోజుల క్రితమే చదరంగం పావులు ఎలా కదులుతాయో నేర్చుకున్నది," అన్నాడు తండ్రి.

అప్పుడు రాజు ఆ పిల్లను పిలిచి, "అమ్మా, రెండురోజులలో ఇంత ఆట ఎలా నేర్చావు?" అని అడిగాడు.

"నాకు నిజంగా ఆట రాదు, మహారాజా. వీళ్ళిద్దరూ ఒకరినొకరు ఓడించుకున్నారు. ఒకరికి తెల్లపావులూ, రెండోవారికి నల్ల పావులూ ఇచ్చాను. తెల్లపావులవారు వేసిన మొదటి ఎత్తు చూసి నల్లపావులవారి మీద వేశాను. ఒకరి ఎత్తులు ఇంకొకరి మీద వెయ్యటం తప్ప నేనేమీ చెయ్యలేదు," అన్నదా పిల్ల. ఆమె యుక్తికి అందరూ సంతోషించారు. రాజు ఆగంతకులతో బాటు ఆమెను కూడా సత్కరించాడు.





# పురాణచంద్రుడు

ఇది చందమామ సంవత్సరమని చెప్పవచ్చు. ఎందుచేతనంటే భూలోకానికీ చంద్రలోకానికీ మధ్య ఈ ఏడే మొదటిసారిగా రాకపోకలు ఏర్పడ్డాయి. ఇకముందు ఈ రాకపోకలు ఇంకా జాస్తి అవుతాయి.

అయితే చంద్రుడు అనాదిగా పురాణ ప్రసిద్ధుడు. ఈ దీపావళికి పురాణచంద్రుడి కథలు కొన్ని జ్ఞాపకం చేసుకుందాం.

పురాణ చంద్రుడు ఎలా పుట్టాడు? ఈ విషయం కొన్ని గాథలున్నాయి.

బ్రహ్మదేవుడు అత్రిని సృష్టి చేయమని ఆజ్ఞాపించాడట. అత్రి తపస్సు చేసేసరికి ఆయన కంటి నుంచి తేజస్సు వెలువడి దశ దిశలు వ్యాపించిందట. ఆ దశ దిశలూ ఆ తేజస్సును భరించలేక సముద్రంలో పడేశాయట. సముద్రంలో పడిన ఆ తేజస్సుకు బ్రహ్మ ఒక రూపం ఇచ్చాడట. దేవతలు వచ్చి సోమమంత్రం చదివారట. అప్పుడు చంద్రుడు (సోముడు) పుట్టాడట. దేవతలకు ఆహారంగా ఉండటానికి చంద్రుడు సృష్టి అయాడని ఒక అభిప్రాయం ఉన్నది.

క్షీరసాగర మథనమప్పుడు అమృతంతో బాటు లక్ష్మి, చంద్రుడూ, కల్పవృక్షమూ, ఐరావతమూ, ఉచ్చైశ్రవమూ మొదలైనవి చాలా పుట్టాయి. ఈ విధంగా చూసినా చంద్రుడు సముద్రంలో నుంచి పుట్టినవాడే.

క్షీరసాగరమథనం పూర్తి అయాక ఆ అమృతాన్ని తాగటానికి దేవతలూ, రాక్షసులూ రెండు పంక్తులుగా కూర్చున్నారు. దేవతల పంక్తిలో చంద్రుడు కూడా కూర్చున్నాడు. అప్పుడు రాహువు అనే రాక్షసుడు దేవతా రూపంలో వచ్చి, తాను కూడా అమృతం తాగసాగాడు. చంద్రుడు అది చూసి విష్ణువుతో చెప్పాడు. విష్ణువు చక్రాయుధంతో రాహువు తల నరికేశాడు. కాని





అమృతం తాగిన కారణంగా వాడు చావక, చంద్రుడి మీది కసి కొద్దీ అప్పుడప్పుడూ, చంద్రుణ్ణి మింగుతూంటాడు. అదే చంద్ర గ్రహణం.

చంద్రుడి విద్యాభ్యాసం బృహస్పతి వద్ద సాగింది. బృహస్పతి భార్య అయిన తార తన భర్త ఇంటలేనప్పుడు చంద్రుడితో ఉంటూ గర్భవతి అయింది. చంద్రుడు తారను తీసుకుని లేచి పోయాడు. బృహస్పతి వెళ్ళి తన భార్యను తన కివ్వమని చంద్రుణ్ణి అడిగాడు. చంద్రుడు ఇవ్వ నన్నాడు. దేవతల మీదా, దేవతల గురువైన బృహస్పతి మీదా రాక్షసులకు పగ.



అందుచేత వాళ్ళు చంద్రుడి పక్షమై బృహస్పతిని తరిమేశారు. బృహస్పతి వెళ్ళి బ్రహ్మాదులతో మొరపెట్టుకున్నాడు.

ఈ లోపల తార ఒక మగబిడ్డను కన్నది. వాడు నా కొడుకేనంటే నా కొడుకేనని బృహస్పతీ, చంద్రుడూ తగాదాపడ్డారు. బ్రహ్మదేవుడు ఎవరిమాట నమ్మాలో తెలియక తారనే అడిగాడు. తాను కన్నకొడుకు చంద్రుడి కొడుకేనని తార అన్నది. అప్పుడు బ్రహ్మ తార కొడుకును చంద్రుడి కిప్పించి, తారను బృహస్పతి కిప్పించాడు.

అలా తారకూ చంద్రుడికీ పుట్టినవాడే బుధుడు. (బుధుడికి సౌమ్యుడు-సోముడి కొడుకు-అనే పేరున్నది. ఈ యేడు తెలుగు పంచాంగాల ప్రకారం సౌమ్య. ఇది కూడా చంద్రుడి నుంచి వచ్చిన పేరే. ఆ విధంగా కూడా ఇది చందమామ సంవత్సరం.)

దక్షుడికి 27గురు కుమార్తె లుండేవారు. నక్షత్రాల పేర్లే వారి పేర్లు. అంతమందినీ చంద్రుడి కిచ్చి చేశారు. అయితే చంద్రుడు మిగిలినవాళ్ళ కన్న రోహిణి అంటే ఎక్కువ ఇష్టంగా ఉండేవాడు. అది చూసి మిగిలిన భార్యలు కోపించి, వెళ్ళి తమ తండ్రి అయిన దక్షుడితో చెప్పుకున్నారు. దక్షుడు కోపోద్రేకంతో చంద్రుణ్ణి క్షయం కమ్మని

శపించాడు. ఈ శాపానికి భయపడి చంద్రుడు శివుణ్ణి శరణుజొచ్చాడు. శివుడు చంద్రుణ్ణి తన నొసట పెట్టుకుని కాపాడాడు. చంద్రుడీ విధంగా తన భార్యలకు మరింత దూరమై పోయాడు.

దక్షుడు శివుడి వద్దకు వెళ్ళి, చంద్రుణ్ణి వదలమన్నాడు. శరణాగతుణ్ణి వదిలేది లేదన్నాడు శివుడు. అప్పుడు దక్షుడు శివుణ్ణే శపించబోయాడు. అప్పుడు బ్రహ్మ రాజీ చేశాడు. ఆయన చంద్రుణ్ణి రెండుగా కోసి, అక్షయంగా ఉండే భాగాన్ని శివుడి కిచ్చి, క్షయం పొందే భాగాన్ని దక్షుడి కుమార్తెల కిచ్చాడు.

మరొక కథ ఏమిటంటే, దక్షుడు తనను శపించినప్పుడు చంద్రుడెటో మాయమయాడట. దాని ఫలితంగా పంటలూ, వర్షాలూ భూమి మీద లేకుండా పోయాయి. యజ్ఞాలు సాగలేదు. దేవతలందరూ బ్రహ్మ వద్దకు వెళ్ళి, చంద్రుడు మళ్ళీ వచ్చేటట్టు చెయ్యమన్నారు. చంద్రుడు ఓషధులలో దాక్కున్నాడనీ, ఆ ఓషధులను సముద్రంలో వేసి మథించినట్టయితే చంద్రుడు తిరిగి లభిస్తాడనీ బ్రహ్మ చెప్పాడు. అటుతరవాత దేవతలూ, రాక్షసులూ చేరి క్షీరసాగరాన్ని మథించగా అందులో నుంచి అమృతం వగైరాలతో బాటు చంద్రుడు పుట్టాడు.





చంద్రుడు శివుడి శిరస్సు మీదికి రావడానికి కూడా మరొక కథ ఉన్నది.

దక్షుడు ధరణి అనే భార్యకు కన్న యాభైమంది కుమార్తెలలో పెద్దదైన సతి శివుణ్ణి పెళ్ళాడింది. ఒకప్పుడు బ్రహ్మ చేసే యజ్ఞానికి శివుడు వెళ్ళాడు. అక్కడికి దక్షుడు వచ్చినప్పుడు అందరూ గౌరవంగా లేచి నిలబడ్డారు గాని, శివుడు లేవలేదు, గౌరవించలేదు. అందువల్ల దక్షుడికి శివుడంటే చాలా కోపం.

ఆ కోపంతో దక్షుడు తన కుమార్తె లందరినీ అప్పుడప్పుడూ తన ఇంటికి పిలిచి, చీరెలూ, సారెలూ ఇస్తూండేవాడు, శివుడి



భార్య అయిన సతిని మాత్రం ఆహ్వానించేవాడు కాడు. సతికి తన చెల్లెళ్ళను చూడాలని కోరికగా ఉండేది. దక్షుడు యజ్ఞం చేస్తున్నట్టు తెలిసి, తనకు ఆహ్వానం లేకపోయినా ఆమె పుట్టింటికి వెళ్ళింది.

"నువ్వెందు వచ్చావు?" అని దక్షుడామెను అడిగాడు.

"నేనేం మహాపరాధం చేశాను?" అని సతి ఎదురడిగింది.

"నీ భర్తకు నేనంటే గౌరవం లేదు. నీ మూలాన నాకు పరువుప్రతిష్ఠలు లేకుండా పోయాయి," అన్నాడు దక్షుడు. ఆయన శివుణ్ణి నానామాటలూ అన్నాడు. ఆ అవమానం భరించలేక సతి అగ్నిలో కాలి మరణించింది.

ఈ సంగతి తెలియగానే శివుడు ప్రమద గణాలను వెంటబెట్టుకుని వచ్చి, దక్షయజ్ఞం ధ్వంసం చెయ్యటమే గాక, అక్కడికి వచ్చిన వారిని చంపేశాడు.

చంద్రుడు కూడా ఆ యజ్ఞానికి వచ్చి ఉన్నాడు. అక్కడ చెలరేగిన భీభత్సంలో చంద్రుడు శివుడి కాళ్ళకింద పడి నలిగిపోతూ, తనని కాపాడమని శివుణ్ణి ప్రార్థించాడు. అప్పుడు శివుడు చంద్రుణ్ణి ఎత్తి తన నెత్తిన పెట్టుకున్నాడు.



చంద్రుణ్ణి గురించి మరొక కథ కూడా ఉన్నది.

విఘ్నేశ్వరుడు ఒకనాడు ప్రదోషకాలంలో కడుపునిండా మెక్కి శివుడికి నమస్కరించటానికి వెళుతున్నాడట. భుక్తాయాసంతో అడుగు తీసి అడుగు వెయ్యలేకుండా నడుస్తున్న విఘ్నేశ్వరుణ్ణి చూసి చంద్రుడు పకాల్న నవ్వాడట. అతనలా నవ్వగానే విఘ్నేశ్వరుడి పొట్ట పగిలి, తిన్న పదార్థాలన్నీ బయటపడ్డాయట. చీలిన విఘ్నేశ్వరుడి పొట్టను పాములతో కుట్టారట.

కాని, తన కొడుకును చూసి నవ్వాడన్న ఉక్రోషంతో పార్వతి, ఎవరూ చంద్రుణ్ణి చూడరాదనీ, ఒకవేళ ఎవరన్నా చూస్తే వాళ్ళకు అపవాదులు చుట్టుకుంటాయనీ శపించిందిట. ఇలా శపించానని ఆవిడగారు బ్రహ్మకు కబురు కూడా చేసింది.

ఈ వార్త దేవతలకు చాలా బాధ కలిగించింది. "చంద్రుణ్ణి చూడకుండా మా కెలా జరుగుతుంది? దయచేసి నీ శాపాన్ని ఉపసంహరించు," అని వారు పార్వతిని వేడుకున్నారు. విఘ్నేశ్వరుడి జన్మదినం భాద్రపద శుద్ధ చవితి; ఆనాడు ఈ కథ విన్నవారికి తన శాపం తగలదని పార్వతి తెలియబరిచింది. భాద్రపద శుద్ధ చవితి అంటే వినాయకచవితి. ఆనాడు



మనమంతా ఈ కథ చెప్పుకుంటాం. అందుచేత మనం చంద్రుణ్ణి చూసినా మనకు అపవాదులు రావు.

కృష్ణుడికి ఈ కథ తెలియదులాగుంది. అతను గొప్ప అపవాదుకు గురి అయి, పడరానిపాట్లు పడ్డాడు. సత్రాజిత్తుకు సూర్యుడు శ్యమంతకమణి ఇచ్చాడు. కృష్ణుడు దానిని తన కివ్వమని అడిగితే ఇవ్వక, దానిని తన తమ్ముడైన ప్రసేనుడడిగితే ఇచ్చాడు. ప్రసేనుడు అరణ్యంలో పోతూ ఉండగా ఒక సింహం అతన్ని చంపి మణిని గ్రహించింది. జాంబవంతుడా సింహాన్ని చంపి శ్యమంతకమణిని తీసుకుపోయాడు. ప్రసేనుణ్ణి చంపినది కృష్ణుడేననీ, అతనే శ్యమంతకమణి కాజేశాడనీ అపవాదు పుట్టింది. ఈ అపవాదు నుంచి బయటపడటానికి కృష్ణుడు డిటెక్టివు లాగా అడుగుజాడలనుబట్టి జాంబవంతుడి వద్దకు వెళ్ళి, ఆ జాంబవంతుడితో పోరాడి, శ్యమంతకమణితోపాటు జాంబవతిని కూడా సంపాదించుకున్నాడనుకోండి. అయినా కృష్ణుడికి అపవాదు అంత తేలికగా తప్పలేదు.

శ్యమంతకమణి సత్రాజిత్తు దగ్గిరికి తిరిగి వచ్చింది. కొంతకాలం జరిగాక శతధన్వుడనేవాడు శ్యమంతకమణిని తన కివ్వమని సత్రాజిత్తు నడిగాడు. సత్రాజిత్తు ఇవ్వననేసరికి, అతన్ని చంపి శతధన్వుడు ఆ మణిని ఎత్తుకుపోయాడు. తరవాత కృష్ణుడు శతధన్వుడితో యుద్ధం చేసి అతన్ని చంపాడు. శ్యమంతకమణి కృష్ణుడి వద్దకు చేరిందని అందరూ అనుకున్నారు. ఒకసారి బలరాముడు కృష్ణుడితో, "శ్యమంతకమణి ఏదీ? ఒకసారి చూస్తాను," అన్నాడు.

"నా దగ్గిర లేదు. శతధన్వుడి కొడుకైన భోజుడి దగ్గిరేఉన్నది," అన్నాడు కృష్ణుడు.

బలరాముడు ఆ మాట నమ్మక ఆగ్రహించుకున్నాడు. పార్వతి శాపం తగిలిన వాళ్ళు నిజం చెప్పినా ఎవరూ నమ్మరు!



# గగన చంద్రుడు

ఆకాశంలో ఉండే చంద్రుణ్ణి మనమందరమూ చూస్తూనే ఉన్నాం. అది కూడా భూమి లాగే ఒక గోళం. ఈ గోళం భూమి చుట్టూ నెల కొకసారి తిరుగుతూ, భూమితో కలిసి సూర్యుడి చుట్టూ సంవత్సరాని కొక ప్రదక్షిణ చేస్తున్నది. చంద్రుడిపై పడిన సూర్యకాంతిని మనం వెన్నెల అంటున్నాం. ఎప్పుడూ చంద్రుడిలో సగం భాగం సూర్యకాంతిలోనే ఉంటుంది. ఆ సూర్యకాంతి పడిన భాగం పూర్తిగా భూమి కేసి తిరిగి ఉన్నప్పుడు మనకు పూర్ణిమ; భూమికి ఆ భాగం ఏ మాత్రమూ కనిపించనప్పుడు మనకు అమావాస్య. చంద్రుడి పైన పడే సూర్యకాంతికి భూమి అడ్డం వస్తే అది చంద్రగ్రహణం; భూమికీ సూర్యుడికీ మధ్య చంద్రుడే అడ్డు వస్తే అది సూర్యగ్రహణం. అందుకే చంద్రగ్రహణాలు పూర్ణిమనాడూ, సూర్యగ్రహణాలు అమావాస్యనాడూ వస్తాయి. ఈ విషయాలు మనుషులకు అనాదిగా తెలిసినవే.

దూరదర్శినిలో చూస్తే చంద్రమండలం మీద సముద్రాలూ కొండలూ ఉన్నట్టు కనిపిస్తుంది. కాని శాస్త్రజ్ఞులు ఎంతో ఓపికగా పరిశోధనలు చేసి చంద్రమండలం భూమికి సుమారు రెండున్నరలక్షల మైళ్ళలోపు దూరంలో ఉన్నదనీ, అక్కడ గాలీ, నీరూ, ఏ విధమైన ప్రాణులూ లేవనీ దాని ఆకర్షణశక్తి భూమియొక్క ఆకర్షణ శక్తిలో ఆరోవంతు మాత్రమే ఉంటుందనీ స్పష్టంగా తెలుసుకున్నారు.

ఇలాటి విషయాలు తెలుసుకోకుండా చంద్రుడి పైకి వెళ్లితే ఎంత ప్రమాదం!





**గాలీ**, నీరూ లేని చోట మనిషి కొద్ది క్షణాలు కూడా బతకలేడు. అక్కడ గాలీ నీరూ లేదని తెలిసినప్పటికీ ఇతర ప్రమాదాలు చాలా ఉన్నాయి. ఎన్నో సమస్యలు పరిష్కార మైతేనేగాని భూమి మీద ఉండే మనుషులు చంద్రుడి మీదికి వెళ్ళటం సాధ్యం కాలేదు.

అన్నిటి కన్న మొదటి సమస్య: భూమి యొక్క ఆకర్షణ నుండి తప్పించుకోవటం ఎలా? "మనం ఈ భూమి మీద బావిలో కప్పల్లాగా జీవిస్తున్నాం," అని సోక్రటీస్ అనే గ్రీకు తత్వవేత్త 2400 ఏళ్ళ క్రితం అన్నాడు.



నిజమే భూమి యొక్క ఆకర్షణశక్తి ఆకాశంలో 43,495 మైళ్ళ దాకా మనని విడిచిపెట్టదు. అంత దూరం ఎలా పోవటం? ఆ పరిధిని దాటి పోవాలంటే భూమి యొక్క పరిసరాల నుంచి దాదాపు గంటకు 25 వేల మైళ్ళ వేగంతో కదలాలి. అంత వేగం సాధించే యంత్రా లుంటేనే మనం "నూతి అడుగున ఉండే కప్పల" స్థితి నుంచి "నూతి బయటికి దూకగల కప్పలం" అవుతాం.

ఈ సమస్యను రాకెట్ ఇంజన్లు తీర్చాలి. భూమి యొక్క ఆకర్షణను జయించగల రాకెట్ ఇంజన్లు కొంతకాలం క్రితం తయారై పనిచేస్తున్నాయి.

రెండవ సమస్య: చంద్రమండలం మీద క్షేమంగా దిగేది ఎలా?

ఇదేమీ తేలికసమస్య కాదు. మాట వరసకు మనం ప్రయోగించిన రాకెట్ భూమి యొక్క ఆకర్షణశక్తిని అధిగమించి 43,495 మైళ్ళు దాటిందనుకుందాం. అప్పుడా రాకెట్‌ను చంద్రుడు ఆకర్షించడం మొదలుపెడుతుంది. భూమి ఆకర్షణతో పోలిస్తే చంద్రుడి ఆకర్షణశక్తి తక్కువే. అయినా రెండు లక్షల మైళ్ళ మేర ఈ ఆకర్షణకు గురి అయిన రాకెట్ అంతు



లేని వేగాన్ని అందుకుంటుంది. అంత వేగంతోనూ అది చంద్రుణ్ణి ఢీకొన్నదంటే రాకెట్టూ అందులోని మనుషులూ పచ్చడి పచ్చడి అయిపోతారు.

ఈ సమస్య తీరాలంటే చంద్రయానానికి "ఎదురు" రాకెట్లు ఉండాలి. చంద్ర యానం చంద్రుణ్ణి సమీపించేకొద్దీ వేగవృద్ధి పొందుతుంటే ఈ "ఎదురు" రాకొట్లు ఆ వేగాన్ని తగ్గించుతూ, చంద్రతలం మీదికి చేరేసరికి, వాలే పక్షి లాగా దాదాపు ఏ వేగమూ లేకుండా దిగాలి.

మూడో సమస్య: మనిషి భూమి మీద ఉండే వాతావరణానికి అలవాటైనవాడు. గాలీ, నీరూ లేని చంద్రలోకానికి వెళ్ళా లంటే మనిషి తనకు కావలసిన గాలినీ, అందులో ఉండవలసిన చెమ్మనూ వెంట పెట్టుకుపోవాలి. అందుకు ప్రత్యేకమైన తొడుగులూ, పరికరాలూ కావాలి.

నాలుగో సమస్య: ఆకాశంలో ప్రయా ణించేవాడు భారరహిత స్థితిలో ఉంటాడు. అంటే వాడికి బరువు ఉండదు. ఆ స్థితిలో పనులు చేసుకోవాలన్నా, ఆహారపానాలు తీసుకోవాలన్నా, నిద్రపోవాలన్నా చాలా ఇబ్బంది. సమస్యలిలా ఉంటే ఇక ప్రమాదాలకు లెక్క లేదు.



చంద్రనౌక సరిగా నిర్దేశించిన దారిలో నడవకపోతే దాని గతి ఏమవుతుందో చెప్ప టానికి లేదు. ఇలా జరగకుండా దారిలో దాని "మార్గాన్ని" సరిచెయ్యవలసి రావచ్చు.

నౌకను పెద్ద పెద్ద ఉల్కలు ఢీకొని ఘోర ప్రమాదం జరగవచ్చు.

భూమి మీద ఉన్న మనని గాలిపొర రక్షిస్తున్నది. సూర్యుడి నుంచి వచ్చే ప్రసా రాలలో కొన్ని అపాయకరమైనవి గాలిలో మృగ్యమై పోతున్నాయి, కొన్ని బలహీన మవుతున్నాయి. భూమి పరిసరాలను దాటి శూన్యాకాశంలోకి వెళ్ళినవారికి గాలిలేదు.



రెండు అంతరిక్షయానాలు చంద్రమండల పరిసరాలను చేరుకున్నాయి.

అపోలో 11 అంత బరువైన రాకెట్ ఇదివరకు ప్రయోగించబడలేదు. దాని బరువు 64 లక్షల 84 వేల 280 పౌనులు. ఇందులో 1 న్నర కోటి విభాగా లున్నాయట. ఈ రాకెట్ జులై 16 న ఉదయం 9 న్నరకు కేప్ కెనెడీ నుంచి బయలుదేరింది. 12 నిమిషాల సేపట్లో అది 17,427 మైళ్ళ వేగాన్ని అందుకుని భూమికి 119 మైళ్ళ ఎత్తున భూకక్ష్యలో తిరగసాగింది.

అలా రాకెట్ 2 న్నర గంటలపాటు భూమి చుట్టూ ప్రదక్షిణ చేసిన అనంతరం రాకెట్ మూడో అంచె పేల్చబడింది. మూడో రాకెట్ ఇంజను అయిదు నిమిషాలపాటు పనిచేసిందో లేదో, చంద్రప్రయాణానికి కావలసిన వేగం—గంటకు 24,245 మైళ్ళు—వచ్చేసింది.

ఈ వేగం భూమ్యాకర్షణ పరిధి దాటే దాకా తగ్గుతూ, చంద్రుడి ఆకర్షణ పరిధిలో ప్రవేశించగానే మళ్ళీ పెరిగింది. ఈ దశలో కొలంబియా, ఈగిల్ యానాలు రాకెట్ మూడో అంచె నుంచి వేరుపడ్డాయి; కాని ఆ రెండూ ఒకదాని కొకటి సంధించే ఉన్నాయి.

ఇలాటి సమస్యలన్నిటినీ పరిష్కరించి, ప్రమాదాల నుంచి రక్షణలు కలిగించి, మనుషులు భూమి నుంచి బయలుదేరి చంద్రమండల మీద వాలి, అక్కడి నుంచి బయలుదేరి తిరిగి భూమికి క్షేమంగా చేరుకున్నారు.

ప్రయాణీకులు నీల్ ఆమ్‌స్ట్రాంగ్, ఎడ్విన్ ఆల్‌డ్రిన్, మైకేల్ కాలిన్స్ అనే అమెరికా వాళ్ళు.

వీళ్ళు ప్రయాణం చేసిన రాకెట్ పేరు అపోలో 11. దాని ఎత్తు 363 అడుగులు. ఇది మూడు అంచెలు గల రాకెట్. దీని సహాయంతో కొలంబియా, ఈగిల్ అనే

ఈ జంటయానాల వేగం "ఎదురు" రాకెట్ ప్రయోగంవల్ల తగ్గించబడింది. రెండు యానాలూ చంద్రుడి కక్ష్యలో తిరగ సాగాయి.

ఇరవైగంటల సేపు చంద్రుడి చుట్టూ పరిభ్రమించాక అంస్ట్రాంగ్, ఆల్డ్రిన్‌లు ఈగిల్ యానంలో ప్రవేశించి "ఆకాశపు తొడుగులు" ధరించారు. వారిద్దరే చంద్ర మండలం పై దిగనున్నారు. అందుచేత వారికి ఆ తొడుగులూ, ఇతర పరికరాలూ అవసరం.

కాలిన్స్ కొలంబియా యానంలోనే ఉండి చంద్రుడి కక్ష్యలో తిరుగుతూ ఉండగా, అంస్ట్రాంగ్, ఆల్డ్రిన్‌లు ఈగిల్‌ను కొలంబియా నుంచి వేరు చేసి చంద్ర తలానికి దిగి వచ్చారు. చంద్రుడి పైకి దిగేసరికి ఈగిల్‌కు ఉండదగిన వేగం సెకండుకు మూడు అడుగులు మించరాదు. ఇందుకోసమై, ఈగిల్ చంద్రతలానికి 50 వేల అడుగుల ఎత్తులో ఉండగానే దాని రాకెట్ ఇంజను ప్రయోగించబడింది. ఈగిల్ నిర్దేశించిన స్థానంలో ఏ ప్రమాదమూ లేకుండా దిగింది.

వెంటనే వారు చంద్రుడి పైకి అడుగు పెట్టక, భోజనంచేసి, కొన్ని గంటలు విశ్రాంతి తీసుకున్నారు. తరవాత 21 జులై



సోమవారంనాడు (అదీ చంద్రుడి దినమే!) చంద్రుడిపై తామున్నచోట సూర్యోదయం అవుతున్న వేళ అమ్‌స్ట్రాంగ్ ఈగిల్ నుంచి చంద్రుడి పైకి ఎడమకాలు పెట్టి దిగాడు. అతను తమ వెంట తెచ్చుకున్న ప్రత్యేకమైన టెలివిజన్ కామెరాను బయటికి తీసి ఒక స్టాండు మీద అమర్చాడు. ఈ కామెరా సాయంతోనే చంద్రుడి పైన అంస్ట్రాంగ్, ఆల్‌డ్రిన్‌లు చేసేదంతా భూమిమీద ఉన్న వాళ్ళు చూడగలిగారు.

అంస్ట్రాంగ్ దిగిన కొద్ది క్షణాలకు ఆల్‌డ్రిన్ కూడా చంద్రుడిపై అడుగు పెట్టాడు. చంద్ర ధూళిలో వాళ్ళ పాదాల గుర్తులు

పడ్డాయి; అవి టెలివిజన్‌లో భూలోక వాసులకు కనిపించాయి.

తరవాత వారు చంద్రశిలలు కొన్ని తవ్వి పెట్టెలలో పెట్టుకుని, ఈగిల్‌లోకి తిరిగి ప్రవేశించి, దానిని నడుపుకుంటూ కొలంబియా తిరిగే కక్షను చేరుకుని, రెండు యానాలనూ తిరిగి సంధించి, కొలంబియా యానంలోకి వచ్చేశారు.

ఆంస్ట్రాంగ్, ఆల్డ్రిన్‌లు కొలంబియా యానాన్ని వదిలి 27 గంటల 47 నిమిషాలు మాత్రమే ఉన్నారు. కొలంబియా తిరుగు ప్రయాణం చేసి చంద్రయాత్రికులను జులై 24 న సూర్యోదయానికి ముందే పెసిఫిక్ సముద్రంలో హవాయీకి 950 మైళ్ళు నైరృతీ దిశగా దించింది.

మొత్తం చంద్ర ప్రయాణం 195 గంటల, 18 నిమిషాల, 21 సెకండ్లు పట్టింది.

చంద్రయాత్రికులు చంద్రమండలం మీద పరిశోధన పరికరాలేగాక యునైటెడ్ స్టేట్స్ పతాకను నిలబెట్టారు; అంగుళమున్నర వ్యాసం గల సిలికాన్ బిళ్ళను ఉంచారు—అందులో సూక్ష్మలిపిలో ఐసెన్‌హొవర్, కెనడీ, జాన్సన్, నిక్సన్‌ల సందేశాలూ, 72 దేశాల ప్రముఖుల సందేశాలూ ఉన్నాయి: గగారిన్, కుమరోవ్, గ్రిసన్ మొదలైన అంతరిక్ష వీరుల స్మృతి చిహ్నలుగా పతకాలూ, భుజకీర్తులూ ఉంచారు; తమ తిరుగు ప్రయాణానికి అవసరంలేని సరంజామా అంతా చంద్రుడి పైనే వదిలేశారు.

చంద్రుడి నుంచి తెచ్చిన శిలలూ, ధూళీ పరీక్షించటంవల్ల చంద్రు డెలా ఏర్పడిందీ, విశ్వం ఎలా పుట్టిందీ తెలుస్తుందని శాస్త్రజ్ఞులు ఆశిస్తున్నారు. ఏమైనా ఈ చంద్రయానంతో మానవచరిత్రలో ఒక కొత్త అధ్యాయం ప్రారంభమయింది. ఈ అధ్యాయంలో గ్రహాంతరయానాలు కూడా జరుగుతాయంటున్నారు.







# మహాత్మాగాంధి ఆల్బమ్

చందమామ దీపావళి సంచిక అనుబంధం



గాంధీజీ జన్మస్థలం






గాంధీ దంపతులు




దక్షిణాఫ్రికాలో బారిష్టరుగా గాంధీ



సర్దారు పటేలుతో గాంధీ



దేశసంచారం చేస్తున్న గాంధీ



లార్డ్ పెథిక్‌లారెన్స్‌తో గాంధీ



జవహర్‌లాల్‌తో గాంధీ



ఉప్పు సత్యాగ్రహం : సరోజినీదేవితో



సేవాగ్రాం ఆశ్రమం



మౌంట్‌బాటన్ దంపతులతో గాంధీ



గాంధీ ఆస్తి





# సింద్‌బాద్ అద్భుతయాత్రలు

బాగ్దాద్‌లో ఒక గొప్ప వర్తకు డుండేవాడు. ఆయన వద్ద అపారమైన ధనమూ, ఇతర సంపదా ఉండేది. ఆయన గొప్ప దాత; పేదలకు విరివిగా దానధర్మాలు చేశాడు. ఆ వర్తకుడికి సింద్‌బాద్ అని ఒక కొడుకు ఉండేవాడు.

తండ్రి చనిపోయి సింద్‌బాద్ యుక్త వయస్కుడయే సరికి తండ్రికి గల ఆస్తి అంతా అతనికి సంక్రమించింది. అతను తన యీడువారిని కొందరిని చేరదీసి, వారితో సహా తింటూ, తాగుతూ, విలాసాలలో మునిగితేలుతూ, డబ్బును మంచి నీరులాగా ఖర్చుచేస్తూ మహారాజులాగా కొంతకాలం గడిపాడు. కూర్చుని తింటే కొండలు తరుగుతా యన్నట్టు, సింద్‌బాద్‌కు ఉన్నదంతా చూస్తూండగానే హరించి పోయింది.

అప్పు డతనికి జ్ఞానోదయమయింది. సర్వనాశనం కాకమునుపే అతను తనకు మిగిలినదంతా ధనంగా మార్చుకుని, ఆ డబ్బుతో నౌకావ్యాపారం చేయాలనీ, దాని వంకతో ప్రపంచం చూడాలనీ నిశ్చయించుకున్నాడు. అతను తన వద్ద ఉన్న డబ్బుతో సరుకులు కొని, బాగ్దాదు నుంచి బయలుదేరుతున్న వర్తకనౌక ఒకదానిలో ఎక్కాడు. ఆ నౌక నది వెంబడి బస్రా నగరానికి పోతున్నది. అందులో ఇంకా చాలామంది వర్తకులు తమ సరుకులతో ప్రయాణం చేస్తున్నారు.

బస్రా నుంచి సముద్రయానం ఆరంభమయింది. సముద్రం మీద అనేక దీవుల వద్ద నౌక నిలిచింది. వర్తకులు తమ సరుకులను అమ్మటమూ, ఇతర సరుకులకు మారకం వేసుకోవటమూ చేశారు. తరవాత

మొదటి యాత్ర






కొన్ని వారాలపాటు భూమి కనబడకుండానే ప్రయాణం సాగింది.

చివరకు నౌకకు ఒక అందమైన ఆకుపచ్చని దీవి కనిపించింది. సరంగు నౌకను ఆ దీవి వద్దకు చేర్చి లంగరు దించాడు. వర్తకులందరూ తాళ్ళ నిచ్చెనల మీద దీవి పైన దిగారు. వర్తకుల వద్ద ఆహారపదార్థాలూ, వంటపాత్రలూ ఉన్నాయి. కొందరు నిప్పు చేసి వంటలు ప్రారంభించారు. మరి కొందరు సరదాగా షికార్లు కొట్టారు. ఇంకా కొందరు దీవిలో కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు. సింద్‌బాద్ వంట చేసుకున్నాడు, తరవాత షికార్లు చేశాడు.

ఇంతలో ఉన్నట్టుండి ఆ దీవి ఒక్కసారిగా కంపించింది. దాని మీద నిలబడి ఉన్నవారంతా కుప్పకూలిపోయారు. భయాందోళనలు వారిని ముంచెత్తాయి. ఇంతలో నౌకలో నుంచి సరంగు ఆవేశంగా కేక పెట్టాడు: "ప్రమాదం! వచ్చెయ్యండి. అది దీవి కాదు, బ్రహ్మాండమైన తిమింగిలం. అది మంటల వేడికి కదులుతున్నది. ముణిగిపోలదు! చచ్చిపోతారు, వచ్చెయ్యండి"

ఈ మాటలు వింటూనే వర్తకులు ఎక్కడి వస్తువులను అక్కడే వదిలేసి, ప్రాణాలు దక్కించుకోగలందులకు నౌక కేసి పరిగెత్తారు. త్వరలోనే నౌక లంగరు ఎత్తి కదిలింది. కొందరు వర్తకులు నౌకను అందుకోగలిగారు గాని, మరికొందరు అందుకోలేక పోయారు. వారిలో సింద్‌బాద్ కూడా ఉన్నాడు. ఇంతలో తిమింగిలం ముణగనే ముణిగింది. నౌకను అందుకోలేకపోయిన వారంతా, సింద్‌బాద్ సహా, సముద్రం పాలయారు.

మిగిలినవారి మాట ఏమైనా, సింద్‌బాద్ అదృష్టం బాగుండి అతనికి ఒక కొయ్య తొట్టి చిక్కింది; అందులో ఎవరో వర్తకులు బట్టలు ఝాడించుకున్నారు. ఆ తొట్టి

సహాయంతో సింద్‌బాద్ సముద్రం మీద తేలి ఉండగలిగాడు. అతను ఎంతో శ్రమ పడి, బోర్లాపడి తేలుతున్న ఆ తొట్టిపైన ఎక్కి కూర్చుని, కాళ్ళతో నీటిని వెనక్కు తోస్తూ నౌక కేసి పోవటానికి ప్రయత్నించాడు. కాని నౌక, తెరచాపలన్నిటినీ ఎత్తి, శీఘ్రంగా ప్రయాణిస్తూ, కొద్దిసేపటిలోనే కనుమరుగైపోయింది. అంతలోనే చీకటి కూడా ముంచుకొచ్చింది.

తాను ఆ సముద్రం నుంచి ప్రాణాలతో బయటపడతానని సింద్‌బాద్ అనుకోలేదు. ఆ రాత్రీ, మరుసటి రోజంతా అతను అలల తాకిడి అనుభవిస్తూ, చివరకు ఒక దీవి మీద వచ్చి పడ్డాడు. తీరం వెంబడి కొండలు నిటారుగా లేచి ఉన్నాయి. అయితే ఆ కొండల పై భాగం నుంచి ఏవో లతలు కిందికి దిగివచ్చి, సముద్రంలోకి కూడా విస్తరించి ఉన్నాయి. సింద్‌బాద్ తన శరీరంలో ఉన్న కాస్త శక్తినీ కూడ గట్టుకుని, ఎక్కడలేని బలమూ తెచ్చుకుని, ఆ లతలను పట్టుకుని ఎగబాకి, పైకి చేరుకున్నాడు.

పైకి చేరగారే అతనికి తాను పడ్డ బాధ అంతా ఒక్కసారి పైకి వచ్చేసింది. అతని అవయవాలన్నీ హూనమై ఉన్నాయి. చేపలు అతని కాళ్ళను ఘోరంగా కొరికేశాయి.





బాధతోనూ, అపరిమితమైన నీరసంతోనూ అతనికి స్పృహతప్పిపోయింది.

ఒక రోజంతా అతను ఒళ్ళు తెలియకుండా పడి ఉండి, మర్నాడు తన ముఖం మీద ఎండ పడేసరికి మేలుకున్నాడు. లేవబోయి కిందపడి, మోకాళ్ళ మీద పాకుతూ అతను ఒక సమతలం చేరుకున్నాడు.

అది అతని పాలిటికి స్వర్గమనిపించింది. అక్కడ మంచి పళ్ళచెట్లు ఉన్నాయి, మంచినీటి సెలయేళ్ళు కూడా ఉన్నాయి. ఆ పళ్ళు తిని, నీరు తాగి ఆకలి దప్పులు తీర్చుకుంటూ ఆ ప్రదేశంలో చాలారోజులు గడిపి, శరీర బాధల నుంచి అతను క్రమంగా కోలుకున్నాడు. రెండు చంకకర్రలు తయారు చేసుకుని, వాటి సహాయంతో అతను చెట్ల మధ్యగా తిరుగుతూ, పళ్ళు తింటూ, విధివిలాసాన్ని గురించి ఆశ్చర్యపడుతూ కాలం వెళ్ళబుచ్చసాగాడు.

ఒకనాడు సింద్‌బాద్ సముద్రతీరం వెంబడి నడుస్తూండగా అతని కక్కడ ఒక గుర్రం కనిపించింది. అది మామూలు గుర్రాలలాగా లేదు. సింద్‌బాద్ దాన్ని చూద్దామని సమీపంగా వెళ్ళేసరికి, అకస్మాత్తుగా ఒక వ్యక్తి ఎక్కడి నుంచో ఊడిపడి, "ఎవరు నువు? ఎక్కడి నుంచి వచ్చావు? ఇక్కడికి ఎలా రాగలిగావు?" అని అడిగాడు.

"అయ్యా, నేను సముద్రం మీద ప్రయాణం చేస్తూండగా మాలో కొందరం సముద్రం పాలయాం. దేవుడి దయవల్ల నేనీ దేశానికి ప్రాణాలతో చేరుకోగలిగాను," అన్నాడు సింద్‌బాద్.

ఆ మనిషి అతని చెయ్యి పట్టుకుని భూగర్భంలోకి తీసుకుపోయాడు. అక్కడ ఒక విశాలమైన సావడి లాటిది ఉన్నది. ఆ మనిషి సింద్‌బాద్‌ను ఒక ఉన్నతాసనంలో కూర్చోబెట్టి, అతడికి మంచి భోజనం పెట్టాడు.

కడుపునిండాక సిందబాద్ తన కథ అంతా చెబుతూంటే ఆ మనిషి ఆశ్చర్యంతో విన్నాడు. తరవాత సిందబాద్ కోరగా అతను తన కథ కూడా చెప్పాడు.

అతనికి భోజనం పెట్టిన మనిషి గుర్రాలను పట్టుకునేవాడు. అలాటివాళ్ళు ఆ దీవి అంతటా అక్కడక్కడా ఉన్నారు. వారందరూ మీర్జాన్ మహారాజు నౌకర్లు. ప్రతి అమావాస్యనాడూ సముద్రంలో నుంచి వింత గుర్రాలు దీవి పైకి వస్తాయి. వాటిని పట్టుకోవటమే ఈ కాసావాళ్ళ పని.

"నన్ను కలుసుకోవటం మంచిదయింది. ఒంటరిగా ఈ దీవి మీద నిష్కారణంగా చచ్చిపోయేవాడివి. నిన్ను మా మహారాజు దగ్గిరికి తీసుకుపోతాను," అన్నాడు కాసావాడు సిందబాద్‌తో.

వాళ్ళు ఇలా మాట్లాడుకుంటూండగానే మిగిలిన కాసావాళ్ళు కూడా అక్కడికి చేరారు. తరవాత అందరూ మీర్జాన్ మహారాజు భవనానికి బయలుదేరారు. వాళ్ళు సిందబాద్‌ను ఒక గుర్రం మీద కూర్చోబెట్టి తీసుకుపోయారు.

ముందుగా కాసావాళ్ళు మీర్జాన్ మహారాజుకు సిందబాద్ వృత్తాంతం చెప్పాక, అతనికి రాజదర్శనం లభించింది. మీర్జాన్ సిందబాద్‌కు ఆదరపూర్వకంగా స్వాగత





మిచ్చి, అతని నోటనే అతని కథ అంతా ఆశ్చర్యపోతూ విన్నాడు.

"నాయనా, నువు ఇన్ని గండాలు గడిచి బతికావంటే నీ ఆయువు గట్టిది," అని ఆ మహారాజు సింద్‌బాద్‌ను తన ఆప్త వర్గంలో చేర్చుకుని, అతనికి ఒక ఉద్యోగం ఇచ్చాడు. రేవులు తణిఖీ చెయ్యటమూ, నౌకావ్యాపార వ్యవహారాలు చూడటమూ అతని పని.

ఇది చాలా తేలిక పని. సింద్‌బాద్‌కు కోలెడంత విశ్రాంతి ఉండేది. అందుచేత అతను రోజూ రాజును కలుసుకుని మాట్లాడుతూ ఉండేవాడు. రాను రాను మహారాజుకు అతనిపై గొప్ప అభిప్రాయం ఏర్పడింది. సింద్‌బాద్ ఆయనకు అత్యంత సన్నిహితుడయాడు.

సింద్‌బాద్‌కు ఏ కొరతా లేదు గాని తన దేశానికి దూరమైన బాధ అతన్ని వదల లేదు. అస్తమానమూ అతను తన దేశం గురించే ఆలోచించేవాడు. ఎలాగైనా అక్కడికి తిరిగి వెళతానన్న ఆశ అతనిలో చావలేదు. రేవులోకి దేశాంతరాల నౌకలు వచ్చినప్పుడల్లా అతను నావికులను, "బాగ్దాదునగరం ఏ దిక్కుగా ఉంటుంది?" అని అడిగేవాడు. కాని వారిలో ఒక్కడైనా బాగ్దాదునగరం పేరు విన్నవాడు లేక పోయాడు. స్వదేశానికి తిరిగి వెళ్ళాలన్న ఆరాటమూ, పోలేనేమోనన్న భయమూ అతనిలో క్రమంగా పెరగసాగాయి.

ఒకనాడు సింద్‌బాద్ రేవులో నిలబడి నౌకల కోసం నిరీక్షిస్తూ ఉండగా ఒక పెద్ద నౌక వచ్చి, రేవులో లంగరు దించింది. నౌక వాళ్ళు కిందికి జార్చిన తాటినిచ్చెన ఎక్కి సింద్‌బాద్ నౌకలోకి వెళ్ళాడు. సరంగు సహాయంతో అతను నౌకలోని సరుకులు తణిఖీ చెయ్యటం ప్రారంభించాడు. నావికులు సరుకులు తెచ్చి చూపుతూంటే అతను జాబితా రాసుకున్నాడు.

జాబితా పూర్తి అయాక సింద్‌బాద్ సరంగుతో, "సరుకులన్నీ అయిపోయాయా? ఇంకేమీ లేవా?" అన్నాడు.

"ఉన్నది, బాబూ. అయితే అది విక్రయసామగ్రి కాదు. అందుచేత దాన్ని నౌక అడుగున పెట్టి ఉంచాను. ఆ సరుకు గల మనిషి సముద్ర మధ్యాన మునిగి పోయాడు. అందుచేత, వీలుచిక్కినప్పుడు దాన్ని అతని బంధువులకు చేర్చాలి. వాళ్ళది బాగ్దాదు నగరం," అన్నాడు సరంగు. సింద్‌బాద్ గుండె అమిత వేగంగా కొట్టుకోసాగింది.

"అయ్యో, ఆ మునిగిపోయిన మనిషి పేరేమిటి?" అని అతను సరంగును అడిగాడు.

"సింద్‌బాద్!" అని సమాధానం చెప్పాడు సరంగు.

సింద్‌బాద్ ఇప్పుడు సరంగును మరింత పరిశీలనగా చూసి గుర్తించాడు. తమను సముద్రంలో వదిలేసి నౌకను నడుపుతుంటూ వెళ్ళిపోయినది ఈ సరంగే.

"నేనే సింద్‌బాదును!" అని సింద్‌బాద్ పెద్ద కేకపెట్టాడు.

ఆ తరవాత అతను సరంగుకు తాను పడ్డ కష్టాలన్నీ చెప్పాడు. కాని సరంగు




ఆ మాటలు నమ్మక, "ఎంత మోసం! ఎంత మోసం! మా కళ్ళ ఎదట సింద్‌బాద్ సముద్రంలో మునిగాడు కదా, అతనే నువ్వని అబద్ధాలాడటానికి నీకు సిగ్గు లేదూ?" అన్నాడు.

"నేనే సింద్‌బాద్‌ను. అబద్ధం ఆడవలిసిన అవసరం నాకేమీ లేదు," అంటూ సింద్‌బాద్, తిమింగిలాన్ని దీవి అనుకుని దానిపైన దిగక ముందు జరిగిన వివరాలన్నీ చెప్పాడు. అతని మాటలను సరంగు నమ్మక తప్పలేదు. అతను నౌకలో ఉన్న ఇతర వర్తకులందరినీ పిలిచి, వారికి సింద్‌బాద్‌ను పరిచయం చేశాడు. సింద్‌బాద్

వారి కందరికీ తన వింత కథను చెప్పాడు. వారంతా చావునుంచి తప్పించుకున్నందుకు అతన్ని అభినందించారు.

సింద్‌బాద్ సరుకంతా భద్రంగానే ఉన్నది. సరంగు దాన్ని సింద్‌బాద్ పరం చేశాడు. తన సామానులో అమూల్యమైన వాటిని మీర్జాన్ మహారాజుకు కానుక ఇవ్వటానికి ఉంచి, మిగిలినదంతా బజారుకు తీసుకు పోయి అమ్మేసి, సింద్‌బాద్ తన పెట్టుబడి మీద నూరింతలు లాభం చేసుకున్నాడు.

సింద్‌బాద్ సంగతి తెలియగానే మీర్జాన్ చాలా సంతోషించాడు. ఆయన తాను స్వీక రించిన కానుకల కన్న అనేక రెట్లు విలువ గల బహుమానాలను సింద్‌బాద్‌కు ఎదు రిచ్చాడు. వాటిని కూడా అమ్మేసి సొమ్ము చేసుకుని, ప్రయాణసన్నాహాలు పూర్తి చేసు కుని, చివరసారి రాజదర్శనం చేసుకుని, ఆయన చూపిన దయకు కృతజ్ఞత తెలుపు కుని, సింద్‌బాద్ నౌకలో ప్రయాణ మయాడు. సింద్‌బాద్ వెళ్ళిపోయేటప్పుడు మీర్జాన్‌రాజు తన దేశంలో పుష్కలంగా దొరికే అత్తర్లూ, మంచి గంధమూ, హారతి కర్పూరమూ, సాంబ్రాణీ మొదలైనవి అత నికి కానుకగా ఇచ్చాడు. వాటితో సహా సింద్‌బాద్ నౌకలో ఎక్కి అనేక రోజులు ప్రయాణం చేసి, బస్రా నగరం మీదుగా బాగ్దాదు చేరుకున్నాడు.

దైవకృప వల్ల అతని బంధువులందరూ క్షేమంగా ఉన్నారు. అతను తాను సంపా దించుకు వచ్చిన ధనంతో అనేక భవంతు లనూ, తోటలనూ, ఇతర ఆస్తినీ, బానిస లనూ, దాసదాసీ జనాన్నీ కొనుక్కుని, తన తండ్రి పోయేనాడుండిన దాని కన్న హెచ్చు ఆస్తిని సంపాదించుకున్నాడు. అతను సమస్త భోగాలూ అనుభవిస్తూ తన తొలి ప్రయాణంలో కలిగిన బాధలన్నిటినీ త్వరలోనే మరిచి పోగలిగాడు.

—(ఇంకా వుంది)





# మాట్లాడని రాజకుమార్తె

ఒక అందమైన రాజకుమార్తె చిత్తరువు చూసి ఒక రాజకుమారుడు మోహించి, ఆమెనే పెళ్ళాడతానని ప్రతిజ్ఞ చేశాడు. అతని మిత్రులు అతన్ని ఆ ప్రయత్నం నుంచి విరమించుకోమని హెచ్చరించారు. ఎందుచేతనంటే, ఆ రాజకుమార్తెను పెళ్ళాడతామని చాలామంది బయలుదేరి వెళ్ళి, మళ్ళీ తిరిగి రాలేదట.

ఈ హెచ్చరిక రాజకుమారుడి చెవికెక్క లేదు. అతను ఆరునూరైనా ఆ రాజకుమార్తెను పెళ్ళాడటానికే నిశ్చయించుకుని ఆమె ఉండే దూర దేశానికి ప్రయాణమై వెళ్ళాడు.

అతను ఆ దేశపు రాజధానిలో అడుగు పెట్టగానే ఒక చిన్న గుంపు కనబడింది. ఆ గుంపు మధ్య ఒక మనిషి తన చేతిలో ఒక పంజరాన్ని పట్టుకుని, అందులో ఉన్న పక్షిని వేలం వేస్తున్నాడు. రాజకుమారుడు అందరి కన్న హెచ్చు వెల ఇచ్చి ఆ పంజరాన్ని కొనేశాడు. కొన్న తరవాత తీరా పంజరం తలుపు తీసి చూస్తే అందులో ఉన్న పక్షి ఒక సాధారణమైన పిచ్చుకే.

"ఎంత దగా పడ్డానూ!" అన్నాడు రాజకుమారుడు పిచ్చుకను చూస్తూనే.

"నువ్వేమీ దగా పడలేదు. నావల్ల నీకా పాటి లాభం కలగకపోదు," అన్నది పిచ్చుక.

"ఓహో, నీకు మాటలు వచ్చునా?" అన్నాడు రాజకుమారుడు ఆశ్చర్యపోతూ.

"ఈ పంజరం ఆవతల పారేసి నన్ను నీ జేబులో పెట్టుకో," అన్నది పిచ్చుక.

రాజకుమారుడు పిచ్చుకను జేబులో పెట్టుకుని రాజభవనానికి వెళ్ళి, రాజుతో, "నేను మీ కుమార్తెను పెళ్ళాడగోరి వచ్చాను," అన్నాడు.

గ్రీకు జానపద కథ



దానికి రాజు, "నా కుమార్తె ఏడేళ్ళుగా ఎవరితోనూ మాట్లాడటం లేదు. కారణం ఏమిటో వైద్యులకు కూడా అంతు పట్టలేదు. అందుచేత, ఆమె చేత మాట్లాడించిన వాడికే ఆమె నిచ్చి చేద్దామని నిశ్చయించాను. సాయంత్రం లోపల ఆమెచేత మాట్లాడించ లేకపోతే రేపు నీ తల తీసేయిస్తాను. అందు చేత ఆలోచించుకో," అన్నాడు.

ఆమెను పెళ్ళాడతామని బయలుదేరి వెళ్ళినవారంతా ఎందుకు తిరిగి రాలేదో రాజకుమారుడికి అర్థమయింది. ఏమైనా అతను ఇంత దూరం వచ్చి వెనక్కు పోదలచలేదు. అతనికి ధైర్యం ఇస్తూ జేబు లోని పిచ్చుక, "బెదరకు," అని రహస్యంగా చెప్పింది.

"రాజకుమార్తె చేత మాట్లాడించగలనన్న ధైర్యం నాకున్నది. నన్ను ఆమె ఉన్న చోటికి చేర్చండి," అన్నాడు రాజకుమారుడు.

అంతఃపురంలో రాజకుమార్తెకు విడిగా ఒక భాగం ఏర్పాటయింది. అక్కడ ఆమె అవసరాలు చూడటానికొక ముసలి పరి చారిక కూడా ఉంటున్నది. రాజు రాజ కుమారుణ్ణి రాజకుమార్తె వద్దకు తీసుకు పోయి, "సూర్యాస్తమయం లోపల మాట్లాడించలేకపోతే, ఉదయం శిరశ్ఛేదం తప్పదు," అని చెప్పి వెళ్ళిపోయాడు.





రాజకుమార్తె కిటికీలో నుంచి బయటికి చూస్తూ ఉన్నది. రాజకుమారుడు ఆమెతో, "రాజకుమార్తెకు కుశలమా?" అన్నాడు.

ఆమె జవాబు చెప్పలేదు సరిగదా, అతని కేసి చూడను కూడా లేదు.

"నన్ను ఏ గూట్లోనైనా పెట్టి ఆ గూటితో మాట్లాడు. గూటిని కథ చెప్పమని అడుగు. మిగతా పని నేను చేస్తాను. నేనేదన్నా అడిగితే తిక్కగా సమాధానం చెప్పు," అని పిచ్చుక రాజకుమారుడితో రహస్యంగా చెప్పింది.

"ఏం, రాజకుమారీ? నిన్నే అడిగాను కుశలమా అని! మాటామర్యాదా కూడా తెలీదా నీకు?" అంటూ రాజకుమారుడు ఆమె పక్కగా వెళ్ళి, పిచ్చుకను ఒక గూట్లో పెట్టేశాడు.

"రాజకుమారీ, నువు నాకు బదులు చెప్పకపోతే ఆ గూటితోనే మాట్లాడతాను. అదైనా పలుకుతుందేమో!" అన్నాడు రాజ కుమారుడు.

"వెర్రివాడులాగున్నాడు! గూడు ఎక్కడైనా మాట్లాడుతుందా?" అనుకున్నది రాజకుమార్తె.

"ఏం, గూడూ? రాజకుమార్తె మాట్లాడటం లేదు, నువ్వయినా నా మాటకు బదులు చెబుతావా?" అన్నాడు రాజ కుమారుడు.

"తప్పక చెబుతాను. రాజకుమార్తె వెర్రిబాగులది. ఆమె నెందుకు పలకరిస్తావు? నీకు మాట్లాడాలని ఉంటే నాతో మాట్లాడు. నీ యిష్టం వచ్చినంతసేపు కబుర్లు చెప్పుకుందాం," అన్నది గూట్లో దాగి ఉన్న పిచ్చుక.

రాజకుమార్తె అదిరి పడింది. ఆమెకు ఆగ్రహం కూడా వచ్చింది; "నేను వెర్రి బాగులదాన్నేమీ కాదు!" అని గట్టిగా అరవాలనిపించింది, కాని ఆమె అతి కష్టం మీద తనను తాను నిగ్రహించుకున్నది.

రాజకుమారుడితో సమంగా గూడు కూడా మాట్లాడటం ఆమెకు ఏ మాత్రమూ అర్థం కాలేదు. కాని వారి సంభాషణను ఆమె చాలా శ్రద్ధగా ఆలకిస్తున్నది.

కొంచెం సేపయాక రాజకుమారుడు, "గూడూ, పొద్దూకటానికి ఇంకా చాలా వ్యవధి ఉంది. ఒక మంచి కథ చెప్పు," అన్నాడు. పిచ్చుక ఇలా చెప్పసాగింది:

"ఒక గ్రామంలో ముగ్గురన్నదమ్ము లుండేవారు. పెద్దవాడు వడ్రంగంలో నేర్పరి. రెండోవాడు బట్టలు నెయ్యటంలో నేర్పరి. మూడోవాడికి ఏ విద్యా రాదుగాని, వాడికి దేవుడిలో అపారమైన విశ్వాసం. వాళ్ళు పట్టణంలో బతుకుదామని తమ ఊరు విడిచి బయలుదేరారు. వారు కొండల మధ్య ఉండగా చీకటి పడింది. ఆ రాత్రికి వాళ్ళు ఒక గుహలో గడపవలిసి వచ్చింది. దుష్ట మృగాలు రాకుండా గుహ వెలుపల మంట చేసి, ఒక్కొక్క ఝామూ, ఒక్కొక్కరు మేలుకుని ఉండేటట్టు ఏర్పాటు చేసుకున్నారు. మొదట మేలుకోవటం పెద్దవాడి వంతు. వాడు ఊరికే కూర్చోలేక, ఒక కొయ్యదుంగ తెచ్చి, దాన్ని చెక్కి ఒక ఆడ దాని బొమ్మ తయారు చేశాడు. ఆ తరవాత మేలుకుని ఉండటం రెండోవాడి వంతు. వాడా బొమ్మకు బట్టలు తయారు చేసి,



తొడిగి, మూడోవాణ్ణి లేపి, తాను నిద్ర పోయాడు. మూడోవాడు లేచి ఆ బొమ్మను చూసి మోహించి, దానికి ప్రాణం పొయ్యమని దేవుణ్ణి ప్రార్థించాడు. వాడలా చాలా సేపు ప్రార్థించగా బొమ్మకు ప్రాణం వచ్చి కదిలింది. రాజకుమారా, ఇప్పుడు చెప్పు, ప్రాణం వచ్చిన ఆ బొమ్మను ఎవరు పెళ్ళాడాలి?"

పిచ్చుక ఈ ప్రశ్న వెయ్యగానే రాజకుమారుడు ఆలోచించినట్టు నటించి, "కొయ్య బొమ్మను తయారు చేసిన వడ్రంగి పెళ్ళాడాలి," అన్నాడు.

"రాజకుమారా, పొరపడ్డావు. దానికి బట్టలు తొడిగినవాడి మాటేమిటి?" అన్నది పిచ్చుక.

"మీ ఇద్దరి తెలివీ తెల్లారినట్టే ఉన్నది! ప్రాణం పోసిన మూడోవాడే పెళ్ళాడాలి," అన్నది రాజకుమార్తె గట్టిగా అరుస్తూ. మరుక్షణం ఆమె తన నోటి మీద చెయ్యి వేసి నొక్కుకున్నది గాని అందువల్ల లాభం లేకపోయింది.

"మా చిన్నరాణి మాట్లాడింది!" అంటూ ముసలిదాసీది పరుగున లోపలికి వచ్చింది.

అదే సమయానికి రాజు కూడా వచ్చి, రాజకుమారుడితో, "సూర్యాస్తమయం అయింది. అమ్మాయిచేత మాట్లాడించావా?" అన్నాడు.

"చిత్తం, మాట్లాడించాను," అన్నాడు రాజకుమారుడు.

"అన్నీ వట్టిది. నేను మాట్లాడ లేదు," అన్నది రాజకుమార్తె.

రాజు పగలబడి నవ్వాడు. ఆమె నోట మాట రాగా విని ఏడేళ్ళయింది. అదీగాక, రాజకుమార్తె మాట్లాడటం తాను చెవులారా విన్నానని ముసలిది చెప్పింది.

రాజు తన కుమార్తెను రాజకుమారుడికిచ్చి వైభవంగా పెళ్ళి చేసేశాడు. అందరూ సుఖంగా ఉన్నారు.



# ఇద్దరు మూఢులు

ఒక గ్రామంలో ఒక మూఢుడైన నిరుపేద ఉండేవాడు. వాడి అదృష్టంకొద్దీ వాడి కొకనాడు పదిరూపాయలు దొరికాయి. వాటిని ఎవరి కంటా పడకుండా ఎలా దాచాలో తోచలేదు. చివరకు వాడు తన ఇంటి మట్టిగోడలో కన్నం పెట్టి, రూపాయలు అందులో ఉంచి, తడి మట్టితో మళ్ళీ గోడ పూడ్చి, ఆ మాసిక ఆరిపోయి గోడలో కలిసిపోయినదాకా తన ఇంట్లోకి ఎవరినీ అడుగు పెట్టనిచ్చాడు కాడు.

అప్పటికీ వాడికి భయం తీరలేదు. అందుకని వాడు ఆ గోడమీద సుద్దతో, "ఈ గోడలో డబ్బు దాచి లేదు," అని రాశాడు. అప్పటికి వాడి ప్రాణం కుదటపడింది.

కొన్నాళ్ళ అపతల వాడి మిత్రు డొకడు వచ్చాడు. ఇంటివాడు లోపల లేడు, కాని గోడ మీది రాత కనిపించింది. గోడలోపల డబ్బు దాచి లేదని రాయటం ఎందుకు? తన మిత్రుడు అలా ఎందుకు రాశాడో తెలుసుకుందామని వాడు గోడ తవ్వి చూశాడు. డబ్బు దొరికింది.

వాడికి చాలా సంతోషం వేసింది. అయితే, తన దొంగతనం బయటపడి తన్నులు తినవలసి వస్తుందేమో నని భయంకూడా వేసింది. అందుకని వాడు తన తలుపు మీద, "ఫలానివాడి డబ్బు నేను కాజెయ్యలేదు," అని రాసుకుని చాలా తృప్తిపడ్డాడు.





# మర్యాద రామన్న తీర్పు

ఒక గ్రామంలో ధర్మయ్యా అనే ధనిక భూస్వామి ఉండేవాడు. అతనికి ఒక్కడే కొడుకు. ఆ కొడుకు పేరు శ్రీధరుడు. శ్రీధరుడికి వివాహయోగ్యమైన వయసు రాగానే చుట్టుపక్కల గ్రామాల నుంచి అనేకంగా సంబంధాలు రాసాగాయి. వచ్చిన సంబంధాలన్నిటిలోకీ ఘనమైన సంబంధంగా చూసి ధర్మయ్యా తన కొడుక్కు నిశ్చయించాడు.

పెళ్లి ఊరేగింపు ఏనుగు అంబారీతో జరగాలని ధర్మయ్యాకు అనిపించింది. ధర్మయ్యా దగ్గిర ఏనుగు లేదు గాని, అతని మిత్రుడైన గంగయ్యా వద్ద ఒక ఏనుగు ఉన్నది. ధర్మయ్యా గంగయ్యా వద్దకు వెళ్ళి, "గంగయ్యా, మా అబ్బాయి పెళ్ళి నిశ్చయించాను. పెళ్ళి ఘనంగానే చెయ్యాలనుకుంటున్నాను. ఊరేగింపుకు నీ ఏనుగును అరు విచ్చావంటే, పెళ్ళి పూర్తికాగానే దాన్ని నీకు తిరిగి ఇస్తాను," అన్నాడు.

గంగయ్యా ఏనుగును అరు వివ్వటానికి అభ్యంతరం చెప్పలేదు, కాని ఆ ఏనుగును భద్రంగా తనకు అప్పగించాలనీ, అది తన తాతగారినాటి ఏనుగు అనీ ధర్మయ్యాతో మరీమరీ చెప్పాడు.

పెళ్ళి పూర్తి అయి ధర్మయ్యా స్వగ్రామానికి తిరిగి వచ్చేదారిలో, కర్మచాలక ఏనుగు కాస్తా చచ్చిపోయింది.

"గంగయ్యా, నీ ముఖం చూడటానికే సిగ్గుగా ఉంది. నీ ఏనుగు వచ్చే దారిలో చచ్చిపోయింది. నీకు ఏనుగు ఖరీదు కావాలో, మరొక ఏనుగే కావాలో చెప్పు," అన్నాడు ధర్మయ్యా.

"నాకు నా ఏనుగే కావాలి. ఎన్ని ఏనుగులైతే నా ఏనుగు అవుతుంది?

బి హెచ్. వి. ఎస్. లక్ష్మి



దాన్నే నాకు తెచ్చి ఇయ్యి," అన్నాడు గంగయ్య మూర్ఖంగా.

"చచ్చిన ఏనుగును ప్రాణాలతో ఎలా ఇవ్వను?" అన్నాడు ధర్మయ్య.

గంగయ్య వెళ్ళి మర్యాదరామన్న దగ్గిర ధర్మయ్య మీద ఫిర్యాదు చేశాడు. గంగయ్య చెప్పినదీ, ధర్మయ్య చెప్పినదీ విన్నాక మర్యాదరామన్నకు ఒక్క సంగతి స్పష్టమయింది: ఏనుగు ముసలిది; అది కాలం మూడి చచ్చింది; దాని చావుకు ధర్మయ్య అశ్రద్ధ ఏ మాత్రమూ కారణం కాదు; గంగయ్య పట్టుదల నిజంగా ఏనుగు కోసం కాదు, ధర్మయ్యకు ఏదైనా శిక్ష పడాలనే.

"మీకు రేపు నా తీర్పుచెబుతాను, రండి," అని మర్యాదరామన్న ధర్మయ్యనూ గంగయ్యనూ పంపేసి, ధర్మయ్యకు రహస్యంగా ఒక చీటీ కూడా పంపాడు.

మర్నాడు న్యాయస్థానానికి గంగయ్య వచ్చాడు గాని ధర్మయ్య రాలేదు.

మర్యాదరామన్న గంగయ్యతో, "ఎందుకో ధర్మయ్య రాలేదు. నువు వెళ్ళి అతన్ని పిలుచుకురా," అన్నాడు.

గంగయ్య ధర్మయ్య ఇంటికి వెళ్ళి, "ధర్మయ్యా?" అంటూ తలుపు తోశాడు. తలుపు వెనక ఉన్న కుండలు కాస్తా పగిలాయి.

"అయ్యో, నా తాత ముత్తాతలనాటి కుండలు కాస్తా పగలగొట్టావా, గంగయ్యా?" అన్నాడు ధర్మయ్య లోపలినుంచి వచ్చి. గంగయ్య కుండలకు డబ్బిస్తానంటే ధర్మయ్య తనకు ఆ కుండలే కావాలన్నాడు.

ఇద్దరూ మర్యాదరామన్న దగ్గిరికి వెళ్లారు. ధర్మయ్య గంగయ్య మీద ఫిర్యాదు తెచ్చాడు. "గంగయ్యా, ధర్మయ్య కుండలు ధర్మయ్యకు ఇచ్చెయ్యి, నీ ఏనుగును నీ కిప్పిస్తాను," అన్నాడు మర్యాదరామన్న.

గంగయ్య తెల్లముఖం వేసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.





# మహాభారతం

"అర్జునుడితో ద్వంద్వయుద్ధం చెయ్యాలంటే నువు కూడా రాజువై ఉండాలి," అని కృపాచార్యులు అనటమూ కర్ణుడు తన తల్లిదండ్రుల పేర్లు చెప్పటానికి బిడియపడటమూ గమనించి దుర్యోధనుడు కృపాచార్యులుతో ఇలా అన్నాడు:

"సుక్షత్రియ వంశంలో పుట్టినవారినీ, మహా శూరులనూ, పెద్ద సేనలు గలవారినీ రాజు లనవచ్చునని శాస్త్రాలు చెబుతున్నాయి. అయినా కర్ణుడు అర్జునుడితో ద్వంద్వయుద్ధం చెయ్యటానికి అతడు రాజు కాదన్నదే అభ్యంతరమైతే అతన్ని ఈ క్షణాన్నే అంగరాజ్యానికి రాజుగా అభిషేకిస్తాను."

దుర్యోధనుడు ఆజ్ఞాపించగా మంత్రవేత్తలైన పురోహితులు వచ్చారు. బంగారు సింహాసనం వచ్చింది. బంగారు కలశాలతో నీరు వచ్చింది. పుష్పాక్షతలు వచ్చాయి. దుర్యోధనుడు కర్ణుణ్ణి సింహాసనంలో కూర్చోబెట్టి, రాజుగా అభిషేకించాడు.

ఈ కర్మకాండ ముగియగానే కర్ణుడు దుర్యోధనుడితో, "మహారాజా, నేను నీ నుండి రాజ్యదానం పొందినందుకు ప్రత్యుపకారం ఏమి చెయ్యను?" అన్నాడు.

"నీ వంటి పరాక్రమశాలి మైత్రి నాకు కావాలి," అన్నాడు దుర్యోధనుడు.

ఇదంతా చూస్తున్న కర్ణుడి పెంపుడు తండ్రి సూతుడు తాను తోలే రథం మీది

9. అంగరాజ్యాభిషేకం







ఆకాశంలో సూర్యుడి కేసి చూస్తూ ఉండి పోయాడు. తమ్ములమధ్య కూర్చుని ఉన్న దుర్యోధనుడు భీముడితో, "భీమసేనా, నీ మాటలు ఉచితంగా లేవు. రాజైనవాడు బలంగల ప్రతివాడితోనూ యుద్ధం చెయ్యటానికి సిద్ధంగా ఉండాలి. అర్జునుడైనా అంతే. శూరుల పుటకా, ఏరుల పుటకా ఎవరూ చెప్పలేరు. దివ్యలక్షణాలూ, సహజ కవచకుండలాలూగల ఈ కర్ణుడు సాధారణ జన్ముడు కాడు. అతను ఒక్క అంగ రాజ్యాన్నే కాదు, భూమినంతా ఏలదగినంతటి పరాక్రమవంతుడు. నేనితనికి చేసిన అంగరాజ్యాభిషేకం ఎవరికైనా సమ్మతం కాకపోతే వాళ్ళు నాతో ద్వంద్వ యుద్ధం చేసి జయాపజయాలు తేల్చుకో వచ్చు," అన్నాడు.

ఈ మాటకు ప్రేక్షకులందరూ హాహాకారాలు చేశారు.

ఇంతకూ ఏ ద్వంద్వయుద్ధంగాని జరిగే లోపలనే సూర్యుడస్తమించాడు. కొందరు అర్జునుణ్ణీ, కొందరు కర్ణుణ్ణీ, కొందరు దుర్యోధనుణ్ణీ మెచ్చుకుంటూ అందరూ తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. దుర్యోధనుడికి మాత్రం ఆ రోజు పర్వదినం. ఈ నాటిదాకా అతనికి అర్జునుడు పక్కలో

నుంచి దిగివచ్చి, అంగరాజైన కర్ణుణ్ణి అభినందించాడు. కర్ణుడు సూతుడికి పుత్రభావంతో నమస్కరించాడు. సూతుడు కర్ణుణ్ణి లేవనెత్తి కౌగలించుకున్నాడు. ఇద్దరూ ఆనందబాష్పాలు రాల్చారు.

కర్ణుడు సూతుడి కొడుకన్నది బయట పడిపోయింది. భీముడు కర్ణుడితో, "సూతపుత్రా, రథాలు తోలుకోక అర్జునుడితో ద్వంద్వయుద్ధం చేస్తానంటావే? ఇదేమైనా బాగుందా? నీకీ అంగరాజ్య సింహాసనం మటుకు దేనికి?" అన్నాడు.

కర్ణుడికి మండిపోయింది. కాని ఏమీ అనలేక, కోపంగా బుసలు కొడుతూ

బల్లెంలాగుండి బాధిస్తూ వచ్చాడు. ఈ రోజు నుంచీ దుర్యోధనుడికి అర్జునుడి భయం పోయింది. అతను గుండె మీద చెయ్యి వేసుకుని నిశ్చింతగా నిద్రపోయాడు.

కొంతకాలం గడిచింది. ఒకనాటి ఉదయం ద్రోణుడు తన శిష్యులందరినీ పిలిపించి, "నాకు గురుదక్షిణ ఇవ్వండి," అని అడిగాడు. అందరూ ఆయనకు నమస్కారాలు చేసి, "ఏమిటి తమ ఉత్తరువు?" అని అడిగారు.

"ఐశ్వర్య మదంతో కొట్టుకుంటున్న అవివేకి ద్రుపదుడు. అతన్ని పట్టి తీసుకు రండి," అన్నాడు ద్రోణుడు.

గురువుగారి ఆజ్ఞ నిర్వర్తించటానికి కుమారులందరూ సిద్ధపడి, రథాలు సిద్ధం చేశారు; కవచాలు ధరించారు; ఖడ్గాలనూ, విల్లంబులనూ తీసుకున్నారు; ద్రుపదుడి పైకి యుద్ధానికి పోవటానికి సన్నాహాలు పూర్తిచేసి, అందరూ ద్రోణుడి వెంట బయలుదేరారు.

పాంచాలపురం కనుచూపు మేరలో ఉన్నదనగా అర్జునుడు ద్రోణుడితో, "వీరిలో ఒక్కరుకూడా ద్రుపదుణ్ణి తీసుకు రాలేరు. వీరు విఫలులై తిరిగి వచ్చేదాకా మా పాండవులం ఇక్కడే ఉండి, ఆ తరవాత ద్రుపదుణ్ణి పట్టితెస్తాం," అన్నాడు.





దుర్యోధనుడి ముఠా కర్ణుణ్ణి వెంటబెట్టుకుని రాచనగరు ప్రవేశించి, ద్రుపదుణ్ణి పట్టుకుంటామని వీరాలాపాలాడుకుంటూ రాజమార్గాన వస్తున్న సంగతి ద్రుపదుడికి తెలిసింది. ఆయన వెంటనే తన సేనలనూ, తమ్ములనూ వెంటబెట్టుకుని వాళ్ళతో యుద్ధానికి వచ్చాడు. కౌరవులూ, కర్ణుడూ కొంతసేపు దర్పంగానే పోట్లాడారు గాని, ద్రుపదుడి ధాటికీ, ద్రుపదుడి సేనల విజృంభణకూ తట్టుకోలేక, చావు తప్పి కన్ను లొట్టపోయిన విధంగా అయి, యుద్ధరంగం వదిలి పాండవులున్న చోటికి పారిపోయి వచ్చారు.

అప్పు డర్జునుడు ద్రోణుడికి ప్రణామం చేసి, ధర్మరాజు అనుమతి పొంది, భీముణ్ణి తన సేనకు నాయకుడుగానూ, నకుల సహదేవులను తన రథానికి చక్రరక్షకులుగానూ పెట్టుకుని, ద్రుపదుణ్ణి పట్టి తెస్తానని బయలుదేరాడు.

భీమార్జునులు ద్రుపదుడి సేనమీద పడి అల్లకల్లోలం చేసేశారు. అర్జునుడు భయంకరంగా యుద్ధం చేస్తూ తన రథాన్ని ద్రుపదుడి రథం ఉన్నవేపు పోనిచ్చాడు. ద్రుపదుడు రోషంతో అర్జునుడి మీద దారుణమైన దాడి చేశాడు. ఒక దశలో ద్రుపదుడు కనబడక ఆయన సైన్యం హాహాకారాలు చేసింది. అర్జునుడు ద్రుపదుడి రథాన్నీ, అశ్వాలనూ ధ్వంసం చేసి, కత్తి దూసి ద్రుపదుడి రథం కాడిపైకి దూకి ద్రుపదుణ్ణి పట్టుకున్నాడు.

ఈ లోపల భీమ నకుల సహదేవులు పారిపోయే ద్రుపదుడి సేనలను ఊచకోత కొయ్యటం అతని కంట పడింది. అర్జునుడు గట్టిగా కేక వేసి, "ద్రుపదుడు చిక్కాడు. మనం వచ్చిన పని పూర్తి అయింది. ఈయన మనకు బంధువు. అనవసరంగా ద్రుపదుడి సేనను హతమార్చకండి," అని వారిని హెచ్చరించాడు.

తరవాత అర్జునుడు ద్రుపదుణ్ణి కట్టి తీసుకువచ్చి ద్రోణుడికి గురుదక్షిణగా సమర్పించాడు. ద్రోణుడు ద్రుపదుణ్ణి చూసి, "పాంచాలరాజా, ఇప్పుడు నీ కాంపిల్య నగరం మాకు చిక్కింది. ఇప్పటికైనా నన్ను నీ బాల్యస్నేహితుడిగా గుర్తిస్తావా? భయపడకు. నేను బ్రాహ్మణ్ణి. పరమ శాంతమూర్తిని. మన బాల్యస్నేహాన్ని నేను మరవలేదు. నీ స్నేహం కోసమే నిన్ను తెప్పించాను. నాకు రాజ్యాలు ఏలేవాళ్ళ స్నేహమంటే చాలా ఇష్టం. కాని ఇప్పుడు నీకు రాజ్యం లేదు. నీ స్నేహం కోసమై అర్ధరాజ్యం ఇస్తాను తీసుకో. గంగకు దక్షిణంగా ఉండేదంతా నీ రాజ్యం. ఉత్తరంగా ఉండేది నా రాజ్యం. ఇద్దరమూ హాయిగా రాజ్యాలు ఏలుకుందాం," అన్నాడు.

ద్రుపదుడు ద్రోణుడితో శాశ్వత మైత్రికి ఒప్పుకున్నాడు. ద్రోణు డాయన కట్లు విప్పించి, వెళ్ళిపోనిచ్చాడు.

అదిమొదలు ద్రుపదుడు దక్షిణ పాంచాలానికి మాత్రమే రాజుగా ఉంటూ వచ్చాడు. మాకందీ, కాంపిల్య నగరాలు ఆయన రాజధానులు. సైనిక బలంతో ద్రోణుణ్ణి సాధించటం తనకు అసాధ్యమని ద్రుపదుడు గ్రహించాడు. అదీగాక ఆయనకు సంతాన కాంక్ష తీరలేదు. ఈ రెండు కారణాలచేతా





ఆయన దేశసంచారం చేస్తూ, గొప్ప తపస్సు చేసిన మునులను ఆశ్రయించ సాగాడు.

అహిచ్ఛత్రం రాజధానిగా చేసుకుని ఉత్తర పాంచాలాన్ని ద్రోణుడు పాలించాడు.

ఒక సంవత్సరం గడిచింది. ధృతరాష్ట్రుడు ధర్మరాజును యువరాజుగా అభిషేకించ నిశ్చయించాడు. ధర్మరాజు ధైర్యమూ, ఓర్పు గలవాడు; వక్ర స్వభావుడు కాడు; భృత్యులను ఆదరిస్తాడు.

యువరాజుగా ధర్మరాజు రాజ్యపాలనలో సమర్థుడనిపించుకున్నాడు. అతను పాండురాజు కన్న కూడా మేటి అని అందరూ మెచ్చుకున్నారు.

భీముడు బలరాముడికి శిష్యుడై గదా యుద్ధంలోనూ, ఖడ్గయుద్ధంలోనూ నైపుణ్యం సంపాదించాడు.

అర్జునుడు విల్లును దృఢంగా పట్టుకుని, ఆ చేతికి ఎంత దెబ్బ తగిలినా సరే విల్లు వదలకుండా ఉండటం అభ్యాసం చేశాడు. ద్రోణుడికి నచ్చిన అంశాలలో ఒకటి ఏమంటే అర్జునుడు అతి వేగంగానూ, లాఘవంగానూ బాణాలు వేయగలడు; అన్నిరకాల ఆయుధ ప్రయోగాలలోనూ మంచి చాతుర్యం గలవాడు.

"ఎంతటివాళ్ళు నీతో యుద్ధానికి వచ్చినా సరే వారిపట్ల గౌరవంకొద్దీ మానవద్దు; యుద్ధం విధిగా చెయ్యి," అని ద్రోణుడు అర్జునుడికి సలహా ఇచ్చాడు.

అర్జునుడు ద్రోణుడి అభిమానానికి పాత్రుడై, కౌరవ రాజ్యానికి శత్రువులుగా ఉండి తన తండ్రికి కూడా లొంగని సౌవీర రాజు విమలు డనేవాణ్ణీ, దత్తామిత్రు డనే వాణ్ణీ, అతడి తమ్ముణ్ణీ చంపాడు. తాను ఒక్కడే రథంమీద బయలుదేరి వెళ్ళి, తూర్పు దేశపు రాజులను పదివేల మందిని ఒక్కసారే జయించాడు; ఇంకా అనేక మంది పరిసర రాజులను కౌరవరాజ్యానికి సామంతులుగా చేసి, వారి నుంచి కప్పాలు

గానూ, కానుకలుగానూ అంతులేని ధన రాసులను సంపాదించి, వాటిని హస్తినా పురానికి చేర్చాడు.

నకుల సహదేవులు కూడా కౌరవ రాజ్యానికి శత్రువులైన రాజులను అనేక మందిని జయించి, అంతులేని ధనాన్ని తెచ్చి బొక్కసం నింపారు.

పాండవుల ఖ్యాతి ఈ రూపంగా నాలుగు దిక్కులా వ్యాపించటం చూసి ధృతరాష్ట్రుడు సహించలేక పోయాడు. వారిని అలాగే పైకి రానివ్వటమా, లేక నిగ్రహించటమా అన్నది తేల్చుకోలేక, కణికు డనే ముసలి బ్రాహ్మణ మంత్రిని సలహా అడిగాడు. శత్రువైన వాణ్ణి ఏ మాయోపాయంచేత నిర్మూలించినా తప్పు లేదన్నాడు కణికుడు.

ధృతరాష్ట్రుడిలాగే దుర్యోధనుడు కూడా కర్ణ శకుని దుశ్శాసనులతో ఆలోచించి పాండవులను నిర్మూలించాలన్న నిశ్చయానికి వచ్చి, తండ్రితో చెబితే, తండ్రి అలాగే చెయ్యమన్నాడు. పాండవులను వారణావత పురానికి (కాశీకి) పంపి, అక్కడ లక్కఇంట దహించటానికి పథకం తయారయింది.

ధృతరాష్ట్రుడి ఆజ్ఞను అనుసరించి ఆయన మంత్రులు ఒకరొకరే పాండవుల వద్దకు వచ్చి వారణావతపురం ఎంత అందంగా ఉంటుందో వర్ణించసాగారు;



ఆ నగరాన్ని ఒక్కసారి చూడమని ప్రోత్స హించారు.

తరవాత ధృతరాష్ట్రుడే పాండవులను పిలిపించి, "నాయనలారా, వారణావత పురం చూడటానికి వెయ్యి కళ్ళు చాలవని అందరూ అంటున్నారు. త్వరలో అక్కడ శివుడికి ఉత్సవం కూడా జరగబోతున్నది. కావాలంటే, మీరు మీ అమ్మను వెంట బెట్టుకుని అక్కడికి వెళ్ళి, కొంతకాలం అక్కడ సరదాగా గడిపి, ఆ తరవాత హస్తినాపురానికి తిరిగి రండి," అని అన్నాడు. ఇది దేశ బహిష్కరణ అని ధర్మరాజు గ్రహించి, ధృతరాష్ట్రుడి మాటలకు పెద్దగా ఆనందం ప్రదర్శించ లేదు.

ఈలోగా దుర్యోధనుడు పురోచను డనే శిల్పిని ఏకాంతంగా తీసుకుపోయి అతనితో ఇలా అన్నాడు :

"మా తండ్రి పాండవులను వారణావత పురానికి పంపేస్తున్నాడు. నువ్వు ముందుగానే రథం మీద అక్కడికి వెళ్ళి, లక్క మొదలుగాగల వస్తువులతో, తగల బెడితే దివిటీలాగా మండే ఇంటిని అందంగా తయారు చెయ్యి. అందులో సామగ్రి అంతా ఏర్పాటు చేసి, చూసిన వాళ్ళు ఎంతో బాగున్నదనేటట్టుగా చూడు. పాండవులా యింట ఏ అనుమానమూ లేకుండా కొన్నాళ్ళున్న తరవాత, అర్ధరాత్రివేళ వారు నిద్రలో ఉన్న సమయంలో ఇంటికి నిప్పు పెట్టి వచ్చెయ్యి. వాళ్ళందులో కాలి చచ్చిపోతే నేను నిశ్చింతగా ఉంటాను. నేను తరవాత రాజునై నీకు ఎంత ఉపకారం చేస్తానో చూసుకో."

ఇందుకు పురోచనుడు సమ్మతించాడు. అతనికోసం వేగవంతమైన గుర్రాలను పూన్చిన రథం సిద్ధం చేయించి, దానిమీద అతన్ని వారణావతపురానికి పంపేశాడు. పురోచనుడు అక్కడికి చేరుతూనే శ్రద్ధగా తన పనిలో నిమగ్నుడయాడు.





# గాంధీ కథ

## 9

ట్రాన్స్‌వాల్ శాసనసభ ఆమోదించిన ఆసియావాసుల రిజిస్ట్రేషన్ బిల్లును భారతీయులు తీవ్రంగా నిరసించారు. వారి తరఫున గాంధీ, హెచ్. ఓ. అలీ అనే అతనూ కలిసి ఇంగ్లండుకు వెళ్ళారు. గాంధీ అక్కడ ఆరువారాల పాటు ఉండి, దాదాభాయి నౌరోజీనీ, భారతీయుల పట్ల స్నేహభావం గల బ్రిటిషుపార్లమెంటరీ సభ్యులనూ, విలేఖరులనూ కలుసుకున్నాడు; బ్రిటిషు కలోనియల్ సెక్రెటరీని సందర్శించి మాట్లాడాడు.

కాని ఫలితం శూన్యం. 1907 జులై 1 నుంచీ ఈ జాతివిచక్షణ బిల్లు చట్టంగా అమలులోకి రానున్నట్టు ప్రకటన జరిగింది. భారతీయులది అరణ్యరోదనమయింది. ఈ చట్టాన్ని వ్యతిరేకించటానికి గాంధీ అదివరకే కంకణం కట్టుకుని ఉన్నాడు.

1906 సెప్టెంబరులో ఎంపైర్ థియేటరులో చరిత్రాత్మకమైన సమావేశం జరిగింది; ఆ సమావేశంలో భారతీయులు ఈ చట్టాన్ని ప్రతిఘటిస్తామని ప్రమాణం చేసి ఉన్నారు. సందేహాలు గలవారు జారుకోగలందులకు గాంధీ ఈ ప్రమాణాన్ని భారతీయుల చేత మళ్ళీ చేయించాడు.

జోహన్స్‌బర్గ్‌లో పెద్ద బహిరంగ సభ జరిగింది. దానికి ప్రభుత్వం తరఫున విలియం హాస్కెన్ అనేవాడు వచ్చి, "మీ ఉద్యమం సాగదు. ట్రాన్స్‌వాల్‌లోని ప్రతి తెల్లవాడూ ఈ చట్టాన్ని బలపరుస్తున్నాడు. ప్రభుత్వం బలయుతమైనది. దాన్ని ప్రతిఘటించటమంటే గోడ కేసి తల కొట్టుకోవటమే," అని చాలా కటువుగా ప్రసంగించాడు. ఈ ప్రసంగాన్ని గాంధీ తర్జుమా చెయ్యటం జరిగింది.







ఈ ప్రసంగానికి ఠకీమని జవాబు వచ్చింది. ముహమ్మద్ కఛాలియా అనే వర్తకుడు ఇలా అన్నాడు: "ప్రభుత్వబలం నాకు తెలుసు. అది మమ్మల్ని ఖైదు చెయ్యవచ్చు, మా ఆస్తులు స్వాధీనం చేసుకోవచ్చు, మమ్మల్ని దేశబహిష్కరణ చెయ్యవచ్చు, ఉరితీయవచ్చు. ఇదంతా సహించగలం గాని, ఈ చట్టాన్ని సహించం."

ముఖ్యపట్టణాలన్నిటిలోనూ పర్మిట్ ఆఫీసులు ఏర్పాటయాయి. ప్రతి భారతీయుడూ రిజిస్టరు చేసుకునేటందుకు 1907, జులై 31 దాకా గడువు ఇవ్వబడింది. గాంధీజీ స్థాపించిన అహింసా ప్రతిఘటన అసోసియేషన్‌వారు పర్మిట్ ఆఫీసులను బాయికాట్ చెయ్యమని ఆదేశించారు. "భారతీయులారా, స్వతంత్రులుగా ఉండండి," అన్న పోస్టర్లు వెలిశాయి.

పర్మిట్ ఆఫీసుల పికెటింగు విధానాలను గాంధీ అతి సూక్ష్మంగా రూపొందించాడు; వాలంటీర్లను చేర్చాడు—వారిలో కొందరు కుర్రవాళ్లు. వాలంటీర్లు పర్మిట్ ఆఫీసుల ముందు నిలబడి, రిజిస్టరు చేసుకునేటందుకు వచ్చే భారతీయుల చేత ఆ పని మాన్పించ యత్నించాలి; దుడుకుచర్యలు చెయ్యరాదు; అమర్యాద చూపరాదు. పోలీసులు అరెస్టు చెయ్యవస్తే సంతోషంగా సమ్మతించాలి.

నిజానికి భారతీయులను పర్మిట్లు తీసుకోకుండా నిరోధించటానికి బలప్రయోగం వేరే అవసరం లేదు, అత్యంత బలకరమైన జనాభిప్రాయమే ఉన్నది. కొద్దిమంది చాటుగా రాత్రిపూట వచ్చి రిజిస్టరు చేసుకున్నప్పటికీ, బాయికాట్ విజయవంతమయింది. ప్రభుత్వం గడువు పొడిగించింది. కాని నవంబరు ఆఖరునాటికి 511 మంది భారతీయులు మాత్రమే రిజిస్టరు అయారు.

1907 డిసెంబరు 26న ఈ జాతి విచక్షణ చట్టానికి ఇంగ్లండు నుంచి రాజాను



మతి కూడా లభించింది. మర్నాడు జోహాన్స్‌బర్గ్‌లో సమావేశంలో మాట్లాడుతూ గాంధీ, "ఇది భారతీయుల రాజభక్తికి విషమపరీక్ష....తమకు ఇండియా కావాలో, వలసలే కావాలో బ్రిటిషు ప్రభుత్వం తేల్చుకోవాలి," అన్నాడు. అప్పుడు ట్రాన్స్‌వాల్ మంత్రివర్గంలో భారతీయ వ్యవహారాలు చూస్తున్న జనరల్ స్మట్స్ భారతీయుల బెదిరింపులను లక్ష్యపెట్టలేదు.

రిజిస్టరు చేసుకోనందుకు సంజాయిషీ ఇవ్వటానికి గాను, డిసెంబరు 28 న గాంధీ, ఆయన అనుచరులు 26 మందీ కోర్టుకు రప్పించబడ్డారు. 15 రోజుల లోపల వారు ట్రాన్స్‌వాల్ నుంచి వెళ్ళిపోవాలని ఉత్తరువు జారీ అయింది. వారా ఉత్తరువును ఖాతరు చెయ్యలేదు. 1908 జనవరి 10 న వారి విచారణ జరిగింది. వారు నిర్దోషులమని చెప్పలేదు; శిక్ష అనుభవించటానికి సిద్ధంగా ఉన్నామన్నారు. అందరికీ నాయకుడు గనక తనకు గరిష్ఠ ప్రమాణంలో శిక్ష విధించమని గాంధీ కోరాడు. ఆయనకు రెండు నెలల సాధారణ ఖైదు విధించారు.

గాంధీనీ, ఆయన ముఖ్యానుచరులనూ జైలులో పెట్టినాక ఉద్యమం చల్లారిపోక పోగా, భారతీయులు జైళ్లకు పోవటానికి ఆసక్తి ప్రదర్శించారు. జనానికి జైలు భయం పోయింది. దానికి "ఎడ్వర్డు రాజు గారి హోటలు" అన్న మాట పుట్టింది. 50 మందికి మాత్రమే చోటున్న జోహాన్స్‌బర్గ్ జైలులో 155 మంది సత్యాగ్రహులను ఖైదు చేశారు.

"ట్రాన్స్‌వాల్ లీడర్" అనే పత్రిక అప్పుడప్పుడూ భారతీయులను సమర్థించుతూ రాసేది. దాన్ని నడిపే తెల్లవాడు ఆల్బర్ట్ కార్ట్‌రైట్ అనేవాడు. అతను జైలులో గాంధీని చూడవచ్చి, తాను జనరల్ స్మట్స్‌తో మాట్లాడాననీ, భారతీయులందరూ రిజిస్టరు

చేసుకునే పక్షంలో "ఆసియా వాసుల రిజిస్ట్రేషన్ చట్టం" ఉపసంహరించబడుతుందని స్మట్స్ అన్నాడనీ, అందుకుగాను ఒప్పందం ముసాయిదా సిద్ధంగా ఉన్నదనీ అన్నాడు.

మరి రెండు రోజుల అనంతరం గాంధీ, ఖైదీగా ఉంటూనే, ప్రిటోరియాకు వెళ్ళి స్మట్స్‌ను కలుసుకున్నాడు. స్మట్స్ భారతీయులను మెచ్చుకున్నాడు, తన అసహాయ స్థితిని తెలుపుకున్నాడు, భారతీయులు రిజిస్టరు చేసుకున్నట్టయితే జాతివిచక్షణ చట్టం రద్దవుతుందని మాట ఇచ్చాడు. చర్చల అనంతరం జరిగిన ఒప్పందంలో గాంధీ సూచించిన సవరణలు ఆమోదించబడ్డాయి.

"నే నెక్కడికి వెళ్ళేట్టు?" అని గాంధీ అడిగాడు.

స్మట్స్ నవ్వి, "రేపు ఉదయం ఖైదీలందరినీ విడుదల చేస్తాను," అన్నాడు.

అప్పటికి సాయంకాలం 7 అయింది. గాంధీ దగ్గిర ఎర్ర ఏగానీ లేదు. స్మట్స్ కార్యదర్శి వద్ద రైలు ఖర్చులు అప్పు తీసుకుని, రైలుస్టేషనుకు పరిగెత్తి, జోహన్స్‌బర్గ్‌కు బయలుదేరే ఆఖరు బండి పట్టుకున్నాడు. గమ్యస్థానం చేరుతూనే ఆయన భారతీయులను సమావేశపరిచి, తాను స్మట్స్‌తో చేసుకున్న అనధికార ఒప్పందం గురించి తెలిపాడు. విమర్శలు బయలుదేరాయి. ప్రభుత్వం మాట నిలబెట్టుకుంటుందని ఏమిటి? ప్రత్యర్థి మాట నమ్మటం సత్యాగ్రహి ధర్మమన్నాడు గాంధీ. ప్రభుత్వం మాటతప్పితే సత్యాగ్రహం ఉండనే ఉన్నది.

ఒక పఠాను గాంధీని తెగ కొక్కరించి, "15 వేల పౌనులు లంచం పుచ్చుకుని స్మట్స్‌కు అమ్ముడు పోయావు," అని గాంధీపై ఆరోపణచేశాడు. మొదట రిజిస్ట్రేషన్ చేసుకున్నవాణ్ణి చంపుతా నన్నాడు.



# 96. కోపెన్‌హాగెన్ "జలకన్య"

**హాన్స్** క్రిస్టియన్ ఆండర్సన్ అనే సుప్రసిద్ధ డెన్మార్కు జానపద కథకుడు ఒక కథలో ఒక జలకన్య ఒక రాజకుమారుణ్ణి ప్రేమించినట్టు రాశాడు. ఎడ్వర్డ్ ఎరిక్సన్ అనే శిల్పి ఆ ఊహాసుందరి రూపం కంచుతో సృష్టించి, దాన్ని కోపెన్‌హాగెన్ (డెన్మార్క్) రేవులో ప్రతిష్ఠించాడు. ఈ జలకన్య అప్పుడే నీటి నుంచి బయటికివచ్చి రాతి పైకి చేరినట్టుగా ఉంటుంది. డెన్మార్క్ దేశంలో ఈ ప్రతిమకు తీసినన్ని ఫోటోలు మరి దేనికీ తీయరట.



# ప్రియమైనవి విద్యార్థులకు తలిదండ్రులకు కూడ!




## శ్వాన్
కేంబ్రిడ్జ్ మరియు ఆక్స్‌ఫర్డ్ పెన్‌లు




## శ్వాన్ సిరా
చక్కని వ్రాతకు అత్యంత ఆవశ్యకం !




**శ్వాన్ (ఇండియా) ప్రై; లి;**

ఆర్కాడి చాంబర్స్, పి. మెహతా రోడ్, బొంబాయి-1. బి.ఆర్
బ్రాంచి: 34, బి, కన్నాట్ ప్లేస్, న్యూ ఢిల్లీ-1.







*New*

**Teeth Cleaning Unit**

# 'Kashmir'

**TOOTH PASTE**
**TOOTH POWDER**
**and**
**TOOTH BRUSH**

by

**THE NATIONAL TRADING CO.**

Manufacturers of

**KASHMIR SNOW BEAUTY AIDS**

BOMBAY-2. MADRAS-32.

Photo by A. V. Rangaiah



బహుమతి
పొందిన వ్యాఖ్య

మూగ మనుషులు

పంపినవారు:
వి. ఎ. ఖాదర్, కలకడ

Photo by Vidyachandra Patwa



బహుమతి
పొందిన వ్యాఖ్య

లేత మనసులు

పంపినవారు:
ఏ. ఎ. ఖాదర్, కలకడ

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1970 జనవరి నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి అయిన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబర్ నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: మూగమనుషులు

రెండవ ఫోటో: లేతమనసులు

పంపినవారు: వి. అబ్దుల్ ఖాదర్

టీచర్, కలకడ (చిత్తూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road. Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# ఫోస్‌ఫోమిన్

శక్తిని పెంపొందించును.

ఆకలిని అధికము చేయును.

సహనశక్తిని



హెచ్చించును.

శరీరముయొక్క

రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

అవును —

కుటుంబము అంతటికి ఫోస్‌ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.




ఫోస్‌ఫోమిన్ ...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్‌ఫేట్లుగల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్

SQUIBB® TTT®

SARABHAI CHEMICALS

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం: దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

Shilpi SC 50 A /67 Tel



నవంబర్ విడుదల!
సంజీవిని ఫిలిమ్స్
గండర గండడు
నిర్మాతలు
G.రామం, V.చంద్రశేఖర్
దర్శకత్వం
K.S.R.దాస్
సంగీతం
S.P.కోదండపాణి
ఫొటోగ్రఫీ
అన్నయ్య
నృత్యం
K.S.రెడ్డి
కళ
B.N.కృష్ణ
కూర్పు
K.గోపాలరావు
ఆంధ్ర
అపరాజిత ఫిలిమ్స్
సీడెడ్
అనూరాధ ఫిలిమ్స్
నైజాం
శ్రీ పద్మ పిక్చర్స్
మైసూర్
వినాయక్ ఫిలిమ్స్

# దీపావళి అభినందనములు



అమితానందముతో ఉజ్జ్వలమైన దీపావళి వెలుగు

బాటుకు... **కరోనా !**

స్ప్రింగ్‌ఫ్లవర్
రూ. 10·95*



సన్-ఎన్-స్యాండ్
రూ. 11·95* (పురుషులది)
రూ. 10·25* (బాలురది)



కేప్టెన్
రూ. 17·95*



వేర్‌వెల్
రూ. 32·95* (పురుషులది)
రూ. 25·75* (బాలురది)



*పన్నులు అదనము

కరోనా పాదరక్షలు త్వరగా అరగవు, త్వరగా చిరగవు!

**కరోనా సాహు కం. లి.**
**221**, దాదాభాయి నౌరోజీ రోడ్, బొంబాయి-1

AYARS. CS. 33 TL

